సమర్పితం
క్రొత్త
# గోద్రెజ్ సాండల్




ఐరోపా, అమెరికాలకు ఎగుమతి నిమిత్తం ప్రత్యేకంగా సృష్టితమై బయల్వరచబడ్డ సౌఖ్యానందకరమైన సబ్బు, ఇపుడు ఎన్నికగా భారతదేశంలో అమ్మకమగుచున్నది :

గోద్రెజ్ సాండల్...శుద్ధమైన మైసూర్ చందన నూనె నుండి నైపుణ్యంగా మిశ్రమం చేయబడిన ఉల్లాసకరమైన ప్రశస్తమగు నిలవుండే పరిమళం గలది...ఇట్టి వాటిలో చాలా కాలం నిలవుండే చాలా పెద్ద సబ్బు నేడే దీనిని వాడి చూడండి. దాని హాయిగొలిపే పరిమళం మీ కెంతో ప్రీతియైనది !

## గోద్రెజ్ సాండల్
...అందరూ ఆనందించగల సౌఖ్యదాయకం



Godrej
గోద్రెజ్
సబ్బులలో
ఉత్తమ
నామము



అన్నపూర్ణావారి



# ఆత్మగౌరవం

నిర్మాత
డి.మధుసూదనరావు BA

దర్శకుడు
కె.విశ్వనాథ్

సంగీతం రాజేశ్వరరావు
ఛాయాగ్రహణం సెల్వరాజ్
నవయుగ విడుదల

# ఉత్తరాలు

### వ్యాసాలు

11—3—66వ తేదీ సంచికలో కీ. శే. వినాయక దామోదర సావర్కార్‌ను గురించిన వ్యాసం చదవండి, అని అదే సంచిక ప్రథమ పుటలో సంపాదకులు 'మన లో మాట'గా వివరించినారు. అంతటి ప్రాధాన్యత కల్గిన వ్యాసాన్ని అందులో వీర సావర్కార్‌ను గురించిన వ్యాసం చదవగల్గుతున్నందుకు ఎంతో సంతోషించాం. అవెనుకనే విచారించతగ్గ అంశం కూడా వున్నదని తెలుస్తున్నది. అది చాలా బాధాకరమైనది. సావర్కార్‌ను గురించి వ్రాసిన పుట తర్వాత కాగితం త్రిప్పి చదవడానికి మనకు చాలా బాధాకరమైన మరొక వ్యాసం చదువవలసి వస్తుంది. అది రీటా హేవర్తును గురించి వ్యాసం. ఆ రెండు వ్యాసాలకూ ఒక్కొక్క దానికి ఎంత స్థలం పత్రికా ప్రచురణ కర్తలు కేటాయించారో పరిశీలిస్తే ఒక విషయం స్పష్టపడుతున్నది. అది, వీర సావర్కార్ కన్నా ఒక సినిమా నటికి ఎక్కువ ప్రాధాన్యత నివ్వడం! జాతికి, దేశానికీ అవమానకరమైన యిలాటి పద్ధతులను ముందుముందు ఏపత్రికా అనుసరించకుండుటకుగ్గాను ఈలేఖ ద్వారా మీ అందరి దృష్టికి తీసుకువస్తున్నాను. పత్రికాధిపతులు, సంపాదకులు ఈ విషయమై పత్రికాముఖంగానే ఒక ప్రకటన చేస్తే బాగుంటుంది.

కీ. శే. సావర్కార్‌గారి అభిమానులు కొందరు కపిలేశ్వరపురం (కృష్ణా), వీరంకి లాకు పగ్గైరా గ్రామాల్లో ఆంధ్రపత్రిక ప్రతులు (11—3—66 పత్రిక) కొన్ని ధ్వంసం చేశారన్న విషయం మీకు తెలిసే వుంటుంది. ఈ విషయంలో మేము చాలా విచారించాము కూడా.

తుమ్మల హేమచంద్రరావు (కపిలేశ్వరపురం)

### ఆంధ్ర వైజ్ఞానికులు

'ఆంధ్రులలో అడుగంటుతున్న ఆసక్తి' గురించి శ్రీ శర్మగారు వ్రాసిన దాని మీద శ్రీ హేమాద్రి వ్రాసింది చాల మటుకు వాస్తవం. ముఖ్యంగా ఆంధ్ర సైంటిస్టులు తమ రీసెర్చి గురించి ధైర్యంగా నల్గురికీ చెప్పుకోడానికి సిగ్గుపడతారన్నది నిజం. భారతదేశంలో ఫిజిక్సులో డాక్టరేట్ గల వారులో సగం పైగా ఆంధ్రులే అని ఎంత మందికి తెలుసు. కెమికల్ ఇంజనీరింగులో డాక్టరేటు గలవారిలో అరవై శాతం ఆంధ్రులే అని పాఠకు లెంతమందికి తెలుసు? అడ్మినిస్ట్రేషన్ ఉద్యోగాల్లో కంటె రిసెర్చిలోనే ఆంధ్రులు బాగా ప్రతిభ చూపగలరు. ఈ విషయాన్నే డాక్టర్ సి. మహాదేవన్ ఎన్నోసార్లు చెపుతుండేవారు.

ఇండియాలో కెమికల్ ఇంజనీరింగ్‌లో ఇంతవరకూ ఎవరికీ ఇవ్వబడని ఎఫ్. ఎన్. అయ్. మెంబర్షిప్ ఈమధ్యనే ప్రొఫెసర్ సి. వెంకట్రావు (ఆంధ్ర విశ్వవిద్యాలయం) లోని టెక్నాలజీ డిపార్టుమెంటు ప్రధానాధ్యాపకులు గారికి ఇవ్వబడ్డ సంగతి ఆంధ్రలో ఎంతమంది ఎరుగుదురు?

'ఆంధ్రపత్రిక' తప్పించి మిగత ఏ తెలుగు పత్రికైనా ఒక్క ఆంధ్ర సైంటిస్టు గురించిగాని, అతను చేసిన రీసెర్చి గురించిగానీ ప్రచురించిందా? యల్లాప్రగడ సుబ్బారావు, కొలచిన సీతారామయ్య గార్ల విషయంలో తప్పించి?

మీరిదివరలో 'తెలుగు వెలుగులు' ప్రచురించి రాజకీయల్లోనూ, సాహిత్యంలోనూ ప్రముఖులైన ఆంధ్రుల్ని పాఠకులకు పరిచయం చేసి ఎనలేని సేవ చేశారు. ఆవిధంగానే ఈసారి ఇంకో శీర్షిక దేన్నైనా ప్రవేశపెట్టి ప్రముఖులైన ఆంధ్ర విజ్ఞాన వేత్తలను మాకు పరిచయం చేసి మా అంధకారాన్ని తొలగించండి.

మా శ్యామ్‌సుందర్ (బొంబాయి)

### కథలు

సరోజ టెక్కలి గారు 'శ్రీమందపాటి' గారి 'శిలాప్రాణాలు' అన్న కథను గూర్చి విమర్శిస్తూ "ఎంత అర్థం లేకపోతే అంత గొప్పది" అన్న యెవరో మహానుభావుని మాటను లిఖించారు. అంతేసి పెద్దమాటలు నాకు తెలియవనుకానీ వారి ప్రశ్నలకు సమాధానమిచ్చే మేర కథను అర్థం చేసికోగలిగానని మాత్రం చెప్పగలను.

సరోజా (కుమారా? శ్రీమతా?) గారి మొదటి విసురు జ్యోతి కథలో ప్రవేశించే వరకు సాఫీగా సాగి అక్కడి నుండి బోధపడటం మానేసిందని.

అసలు కథలో జ్యోతి ప్రవేశంతోనే 'శిలాప్రాణాలు' అనే కథకు నాందీ ప్రస్తావన జరిగింది.

ఆవిడగారి రెండవ ప్రశ్న: "వేణి ఆసుత్రితో చనిపోవలసిన అవసరమేముంది?" అని.

దీనికి సమాధానం 33వ పేజీలోని చివరి కాలంలో రెండవ పేరాలోని మొదటి వాక్యం. 'దత్తులేని శాస్త్రి భోరున ఏడ్చాడు'. ఎక్కడా? ఆసుపత్రిలో వేణి దగ్గర. ఇది విన్న వేణి ప్రాణాలు 'కెవ్వుమనే 'కేక'తో ఆస్పత్రి దద్దరిల్లినట్లు అనంతవాయువుల్లో కలిశాయి.'

'దత్తు, జ్యోతులను చిరుతపులి ఎందుకు తినేసింది?' మూడవ ప్రశ్న.

దీనికి సమాధానం ఆవిడగారి చివరి 'శిలాప్రాణాలుగా జీవించిన— ప్రాణాలనే తీసింది మరొక శిలపతి' అనే సందేహంలోనే వుంది. పోతే ఆ వాక్యానికి, "కాదు. కొండజాతి యువ్వని" అనే మరొక పదంచేర్చి చదువుకోవాలి.

నాల్గవప్రశ్న—పాపం! చిరుతకేం తెలుసు, పగిలిన కప్పుకు తెలుసు, అన్నదానికి రెండింటికి తెలియదు. రచయితకే తెలియాలి అంటారావిడ.

కాని పెంపుడు చిరుతపులి కన్న, పగిలిన కప్పు కన్న, రెండింటిని సృష్టించిన రచయిత కన్న, పెంపుడు చిరుతపులి యజమాని (జీ—నా?) 'దెమస' నృత్యంచేయు రాత్రి బ్రాందీ మైకంలో 'దత్తుకు' తన 'శిలాన్ని' అందించిన కోయజాతి జవ్వని అమాయకతతో ప్రాణాల్లాంటి—తన శీలాన్ని అర్పించుకొన్న 'దత్తు' (తన కెదురుగా) మరొక అందమైన అమ్మాయి ప్రక్కన కారులో కూర్చొని పోతూవుంటే పగిలిన కప్పులాంటి తన హృదయంలో నుండి లేచిన ప్రతీకారమే తన పెంపుడు చిరుతపులియవి

ఆవిడకు బాగా తెలుసు.

లస్కరు అక్క ఎవరు? అనునది ఆయిదవ ప్రశ్న.

దీనికి సమాధానం అదే కథకు 'వసుంధర' గారు వేసిన చిత్రంలో 'పక్కపాంటు'. దత్తు చిత్రానికి కెదురుగా విల్లొంచి అతని వైపు ఓరచూపులు చూస్తున్న—కోయ జవ్వని.

"శిలాశే ప్రాణాలుగా జీవించిన ప్రాణాలనే తీసింది మరొక శిలవతి" దీనికి అర్థమే లేదనేది ఆవిడగారి చివరి చవాకు.

'దెమస' నృత్యం రాత్రి 'దత్తు'కు తన ప్రాణంలాంటి శీలం అర్పించిన శీలవతి, చిరుతపులి యజమానిణి, లస్కరు అక్కయైన కొండజాతి యువ్వని—తీయలేదు. శిలాశే ప్రాణాలుగా జీవించిన ప్రాణాలను తన పెంపుడు చిరుత చేత తీయించింది.

టి. సుబ్బారావు (మదరాసు)

* * *

"మలుపు తిరిగింది" కథ చదివాను. రికమండేషన్లు లేకపోవడంమూలంగా ఈ రోజుల్లో ఫస్టుక్లాసు విద్యార్థులు కూడ ఉద్యోగంకోసం ఎంత బాధపడుతునారో రచయితగారు కళ్లకు కట్టినట్లు చిత్రించారు. కాని చివరిలో ఒక్క పొరపాటు చేశారు. మాధవ్‌ని ప్రభావతి ప్లేగ్రౌండ్‌నుంచి వెలుపలికి తీసుకువస్తుండగా పోస్టుమేన్‌వచ్చి కవరు అందించినట్టు వ్రాశారు. కవరు ప్లేగ్రౌండ్ అడ్రసుకేమైనా వచ్చిందా? అతని గది అడ్రసుకు వచ్చిన కవరును కేవలము కథను త్వరలో ముగించటానికని చెప్పి, పోస్టుమేన్ ఎక్కడో ప్లేగ్రౌండ్‌లో ఉన్న మాధవ్‌కు తెచ్చి యివ్వటం చమత్కారంగా ఉన్నది.

టి. అప్పాజీప్రసాద్ (కాజీపేట)

* * *

'మలుపు తిరిగింది' అన్న కథలో 3గవ పేజి మూడవ వరుస మూడవ పేరాలో "ప్రభావతికి పెళ్లి చేయాలనే తలంపుతో ఉన్నాడు" అని వ్రాశారు మాధవ్ ఆమెను ప్రేమించాడు. అతనేమిటి ఆమెకు పెళ్లి చేయాలనే తలంపు అతనికి కలగడమేమిటి ఇక్కడ. ప్రభావతిని పెళ్లి చేసుకోవాలనే తలంపుతో ఉన్నాడు" అని ఉండాలని నా అభిప్రాయం. ఇక పోతే అదే వరుసలో "ఎవరు లేక ఒంటరితనంతో చాలా క్రుంగి ఎత్తు తగ్గిపోయాడు" అని వ్రాశారు. ఎత్తు తగ్గిపోవడమేమిటి ఎక్కడైనా క్రుంగి మనిషి తగ్గిపోతాడుకాని....ఇలాంటి పొరపాటువల్ల కథలో కొంచెము పటుత్వం తగ్గింది.

జెట్టి గోవిందప్పచౌదరి (బళ్లారి)

* * *

మహీధర్ నళినీ మోహన్‌గారి రచన, రష్యాసర్ప భ్రాంతి, అనే కథానిక నాకు బాగో లేదని చెప్పడానికి విచారిస్తున్నాను. ఏమంటే కథలో ఏమాత్రం పటుత్వం కూడా లేదేమో! అదీగాక రచయిత కథలోని ముగింపునుకూడా అంటీ ముట్టనట్టుగానే వదిలేసి పాఠకులనే వూహించుకోమన్నారు. ఈకథ వ్రాయడంలో బహుశః రచయిత తనకు తెలిసిన రష్యాప్రజల ఆచార వ్యవహారాలను, వారివాడుక భాషను మన పాఠకలోకానికందించాలనే వుద్దేశ్యం దృష్టిలో పెట్టుకున్నారేమో!

సి. ఎస్. శాస్త్రి, (విశాఖపట్నం)

---

# సచిత్ర వ్యాసశీర్షిక!

## త్వరలో నే!



ఆకాశాన్ని అంటుకొనే ఆ మేడల, భవనాల, నగర వీధుల్లో రాయంచల్లా పరుగులుదీసే ఆ కారు. చూట్టూ అశేష పారావారం చూసి, అవి పన్నీటి వీధులే ననుకొంటారు. మనంకూడా అలా పెద్ద వాళ్ల కావాలని ఆశలు పెంచుకొంటారు.

ఒక్కసారిగా ఆ ఆశలన్నీ పేకమేడల్లాగా కూలిపోతే చివరకు మిగిలేది కన్నీరే!

## పన్నీటి వీధుల్లో కన్నీటి జల్లులు!

# ఉత్తరాలు

ఆదివిష్ణుగారి హాస్యనాటిక, వాంటెడ్ ఫాదర్స్, ఉగాది ఆంధ్రసచిత్ర వార పత్రికకే వన్నెతెచ్చింది. నేనూ, మా స్నేహితులూ—ఈ నాటికను చదివి, కడుపు చెక్కలయ్యేట్టుగా నవ్వకుండా ఉండలేక పోయాము.

ఎస్. లక్ష్మీనరసయ్య, (వార్‌సింగ్)

* * *

మహీధర్ నళినీ మోహన్‌గారు రష్యా వాతావరణము చిత్రిస్తూ వ్రాసిన 'రజ్జు సర్ప భ్రాంతి' కథ అత్యుత్తమమయినది. 'కూపస్థమండూకా' ల్లాగా ఉన్నమనకు, పరాయిదేశస్థుల సామాజిక వ్యవస్థలు, కథా సాహిత్యము ద్వారా తెలపటము యిదే తొలిసారేమో ! ఆయన కథకు పెట్టిన పేరు కొంత భ్రాంతిలో పడవేసింది. పేరుకు కొంత వివరణ యిచ్చిఉంటే బాగుండేదేమో? యిలాంటి కథలు, నేటి యువ తరానికి మిక్కిలి ప్రయోజనకారి కాగలవు. రష్యా సాంఘిక సిద్ధాంతాలు మనిశితంగా తెల్పుతూ కథాగమనాన్ని యుక్తియుక్తంగా నడిపిన శ్రీ మహీధర్ నళినీమోహన్‌గారికి ధన్యవాదములు.

టి. జి. నాయుడు (పురుషోత్తమపట్నం)

* * *

"యాచకీయాలు" కథ గమనం బాగానే ఉంది కాని, కాస్త వాస్తవికతకు దూరంగా ఉందనే చెప్పాలి. యాచకులు "వెల్లూరు బియ్యం" పెట్టండి, 'నేయి వేస్తారా' అని అడగడం చాలా అరుదు. అడగలేరు. అమెరికాను "అప్రాచ్యపు దేశం" అని రచయిత చెప్పడం నాగరికతా లక్షణానికి దూరంగా ఉంది.

ఆంజనేయులు (పూనా)

* * *

సిరాజీగారు రచించిన 'కరివేపాకు' చాలా బాగుంది. ఆర్. నాగరాజా (అంబాజ)

## సినిమా

నిజంగా నట సామ్రాట్టు తిరిగి మద్రాసులో చిత్రాలలో నటించడం ఆనందదాయకము. ఏవరు అనుకోని మార్పు శ్రీ ఎ. ఎన్. ఆర్. హైదరాబాద్‌వెళ్లి సినిమారంగానికి తెచ్చారు. అంతవరుకు మరుగుపడిన సారధి ఈనాడు ఖాళీలేక రాజధానిలో చిత్రాలే తీయాలనుకున్నా తీయలేనంత సందడి వచ్చింది. ఇది అంతా ఎ. ఎన్. ఆర్. అక్కడికి వెళ్లడమే. మరల ఈరోజు శ్రీ నాగేశ్వరరావు చిత్రాలలో నటించడానికి మద్రాసు రావడం ఆనందదాయకం.

మద్రాసు నగరంలో చాలమంది తెలుగు వారు ఉన్నారుకాని వారికి తెలుగు సినిమాలు చూచె ఆశలేదు. ఇక్కడవున్న థియేటర్లు అన్నిట్లో తమిళం, ఇంగ్లీషు, హిందీనడుస్తాయి కాని తెలుగువి ఆడవు. ఆడినా ఎప్పటివో పాతచిత్రాలువస్తాయి. నటసామ్రాట్ మద్రాసు నగరంలో ఒక చిత్రశాల నిర్మించి అందు తెలుగు చిత్రాలు ప్రదర్శించి తెలుగువారికి ఆనందం గలిగిస్తే వీరు చిరకాలము తెలుగు వారి మన్ననలుపొంది చిరస్థాయిగా తెలుగు వారి హృదయాలలో నిలిచిపోతారు. అప్పుడు నిజంగా "మద్రాసుకి మంచి రోజులు" అనే పేరు నిలకడగా నిలుస్తుంది.

తటవర్తి సత్యవాణి, శరభరాజు. (మద్రాసు)

## సినిమా బ్యాలెట్

మీరు నిర్వహించిన బాలెట్‌లో ఉత్తమ చిత్రంగా 'సుమంగళి', ఉత్తమ సంగీత దర్శకుడుగ 'కె. వి. మహాదేవన్', ఉత్తమ సహాయ నటుడిగ 'జగ్గయ్య' రావటం చాల ఆశ్చర్యంగ మున్నది. పాఠకులు చాలమంది ఆలోచించి వోట్లు వేసినట్లు లేరు.

జి. పద్మలత, (మంగళగిరి)

## 'కథలో క్షయ'

స్త్రీ కథలోగాని, నవలనిగాని దుఃఖాంతం చేయాలనుకుంటే ఆ కథలోని అతి ముఖ్యమైన, అందమైన, పవిత్రమైన ఓ పాత్రకు టి. బి. తగిలించటం, రచయితలకు ఆచారంగా వస్తున్నట్లున్నది. 'క్షయ' వ్యాధిని తగ్గని జబ్బుగాను, అతి భయంకర వ్యాధిగాను కొన్ని పేజీలకు తక్కువ లేకుండా వర్ణించి, పాఠకులను ఆకట్టుకోవాలని రచయితల ఉద్దేశ్యం. కాని ఈ వర్ణనవల్ల ఎన్నో జీవితాల పరోక్ష హత్యకు కారణభూతులౌతున్నారని గ్రహించక పోవటమే శోచనీయం.

మనకు తెలిసిన సత్యాలనుబట్టి, ఆధునిక వైద్య శాస్త్ర అభివృద్ధితో, ఎంత ముదిరిన క్షయ వ్యాధినైనా కొద్దిరోజులలో సమూలంగా నిర్మూలించజాలిన మందులు వాడుకలో కొచ్చాయి. అంతేకాక ప్రభుత్వం ఎన్నో టి. బి. హాస్పిటల్సు, శానిటోరియములు ప్రారంభించటంవల్ల షుమారు నూటికి తొంభైమందికిపైగా ఈ జబ్బు నయమై ఆరోగ్యవంతులౌతున్నారు.

ముఖ్యంగా క్షయ పేషంటుకు కావలసినది మానసిక శక్తి. అదే నమ్మిక, ఉత్సాహం, విశ్రాంతి. వ్యాధిపీడితుని మనస్సు ఆహ్లాదకరంగా ఉండాలి. తన జబ్బు అతి తేలికగా నయమగునని అతనికి నమ్మిక కల్గించవలయును. విశ్రాంతి తీసుకొంటూ ప్రొద్దు పోవటానికి రోగులు, సామాన్యంగా ఏదో సాహిత్యాన్ని అంటే అందుబాటులో ఉండే ఏ వారపత్రికలో, నవలలో చదవటం పరిపాటి. నో పత్రికలోవున్న 4, 5 కథల లో కనీసం నో మూడు కథలలోనైనా ఓ పాత్ర టి బి. చేత చనిపోవటం చదువుతాడు. అతి భయంకరంగా వర్ణించిన ఆవర్ణన చదివి తనుకూడ బ్రతుకననే ఓ నిర్ణయానికి రావటం జరుగుతుంది. రోగిలో ఆనమ్మకం నశించిన తరువాత డాక్టరు ఎన్ని మందులిచ్చినా తగ్గదు. ముఖ్యంగా క్షయవ్యాధికి కావలసినది, నమ్మకం. అదే క్షీణించిన తరువాత, ఏ వైద్యుడు నేయుకల్గించ ఉండదు.

హాస్పిటల్ అధికారులు రోగులు అలాంటి పుస్తకాలు చదవకుండా నిరోధించాల్సిన అవసరం ఎంతైనా ఉందని, తర్కించుకొని గుర్తించగలరు.

ఈ వ్యాసం చదివి ఏ ఒక్క రచయితైన తన పాత్రను టి. బి. తోను మరో అంటు వ్యాధితోనో చంపటం విరమించుకొంటేనూ, ఏ ఒక్క సంపాదకుడైనా అటువంటి కథను ప్రచురణానర్హంగా చేస్తేను, ఈ వ్యాసోద్దేశ్యం ఫలించినట్లే.

శ్రీ పంచాగ్నుల శివప్రసాద్ (హైదరాబాదు.)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 15—4—66

పరాభవనామ సం॥ చైత్రమాసం బహుళ॥ దశమి

సంపుటము : 58 సంచిక : 33

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

క్రొత్తరేట్ల ననుసరించి 14—1—1966 మొదలు ఆంధ్రసచిత్ర వారపత్రిక చందా వివరాలు.

**భారతదేశం**

| | పోస్టుద్వారా<br>రూ. పై. |
|---|---|
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

**ఇతరదేశాలకు**

**ఓడమీద (Sea Mail)**

| | |
|---|---|
| సంవత్సర చందా | 24.50 |
| అర్ధసంవత్సర చందా | 12.25 |

## వచ్చే వారమే !

చిరకాలంనుంచి నవాబుల ఏలుబడిలోవుంటూ తెలంగాణానికి రాజధానిగా వుండి, ఎట్టకేలకు తెలుగువారికి 'రాచనగరు' అయిన హైదరాబాదును గురించిన వ్యాసం ..

## రాచనగరు హైదరాబాదు

అక్కడి రకరకాల వాతావరణం, వేషభాషలు సంస్కృతీ సంప్రదాయాలను విశదపరచేందుకు ఒక జర్నలిస్టూ, ఒక ఆర్టిస్టు కలిసి రూపొందించిన

## ప్రత్యేక సచిత్రవ్యాసం !

# మనలో మాట

భారతదేశంలోని ప్రధానమైన నాలుగు నగరాల్లో ఒకదానిని గురించి యీ సంచిక మధ్య పేజీలలో చదువవచ్చును. ఈ వ్యాసానికి బొమ్మలు ప్రత్యేకంగా వేసిన శ్రీ మనోహన్‌దత్ మా పాఠకులకు సుపరిచితులే. ప్రస్తుతం మదరాసులోని కాలేజ్ 'ఆఫ్ ఆర్ట్స్'లో 'స్కాలర్'గా వున్న శ్రీ దత్ యిటీవలనే తన బొమ్మల ప్రదర్శనాన్నొకదానిని మద్రాసులో జరిపారు. చిత్రకారుని దృష్టిలో 'మహానగరం' చిత్రంగానే కనిపిస్తుంది... !

* * *

'పంజాబీ సుబా' యీనాటి చర్చనీయాంశం. గత వారం శ్రీ శ్రీకృష్ణ తమ 'ఢిల్లీలేఖ'లో యిదే విషయం గురించి వ్రాశారు. పంజాబ్ సచిత్ర వ్యాసం యీసంచిక 10, 11 పేజీలలో చూడవచ్చును.

* * *

వారపత్రిక ఉగాది సంచికలో ప్రచురించిన శ్రీ ఆదివిష్ణు నాటిక విషయమై ఉత్తరప్రత్యుత్తరాలు జరిపేవారు నరాసరి వారి చిరునామాకే వ్రాయాలి. చిరునామా : శ్రీ ఆదివిష్ణు, ఆదివిష్ణుభవన్, చిలకలపూడి పోస్ట్, మచిలీపట్నం.

* * *

ఆ మధ్య తెలుగులో తయారయిన ఒక చిత్రంతో, కొత్త తారలు బాగా వెలుగులోకి వస్తున్నారు. ఈ సంచిక ముఖచిత్ర సుందరి — విజయ నిర్మల — కూడా ఒక ప్రసిద్ధ దర్శకుని చిత్రంలో నటిస్తోంది. కొత్త తారల పరిస్థితిని 'సింహావలోకనం' చేసే వ్యాసం ఒకటి 46, 47 పేజీల్లో వేశాము.

* * *

ఈ వారంతో 'హాలీవుడ్ ప్రణయాలు' ముగుస్తున్నది!
వచ్చేవారం ఆకర్షణ ఏమిటో, యీ పేజీ చూస్తేనే తెలుస్తుంది.

# విషయానుక్రమణిక

ముఖచిత్రం : నటి విజయనిర్మల : (ఫొటో ప్రభాకర్)










ఎన్నికల్లో :: న విజయం

బ్రిటిష్ లేబర్ పంటపండింది





న్యూఢిల్లీ లేఖ

# ఢిల్లీలో ఆసియాప్రాంతం ఆర్థిక అభివృద్ధి సంఘం సమావేశం

## భారతదేశం గమనించదగ్గ సూచనలు

న్యూఢిల్లీలో ఇప్పటినుంచి 'ఇకెఫే' (ఆసియా దూరప్రాచ్యదేశాల ఆర్థికసంఘం) చర్చ ఆసక్తికరంగానూ, విషయాల్ని తెలిపేదిగానూ ఉంటుంది మిత్రదేశాల సలహాలను, సూచనలను పెడచెవినిబెట్టటం ఇండియా యింకా కొనసాగిస్తూనే ఉందన్న విషయం కూడా అది తెలియజెప్పింది

ఈ చర్చకి ఇండియా శక్తివంతమైన ప్రతినిధివర్గాన్నే పంపింది భారతదేశం ప్రస్తుతపు ఆదాయం జపాన్ స్థాయికి చేరుకోవాలంటే 137 సంవత్సరాలు పడుతుందనీ, న్యూజిలాండ్‌స్థాయికి చేరుకోడానికి 205 సంవత్సరాలు పడుతుందనీ సంఘం సర్వే తెలిపిన విషయాన్ని మంత్రివర్గ ప్రతినిధి శ్రీ బి. ఆర్ భగత్ ఖండించారు. అలా ఖండించడానికి కొన్ని అంకెలను కూడా ఆయన యిచ్చారు.

పాకిస్తాన్ విదేశ వ్యవహారాల డైరెక్టర్ జనరల్ ఖాజా మహమ్మద్ కైసర్ చైనాకి అనుకూలుడే యునైటెడ్ కింగ్‌డమ్ పారిశ్రామికంగానూ, తత్సంబంధమైన సాంకేతిక విజ్ఞానంలోనూ స్వయం సమృద్ధిని సాధించడానికి 100 సంవత్సరాలు పట్టిందని, జపాన్‌కు అరవై సంవత్సరాలు, సోవియట్ రష్యాకి 30 సంవత్సరాలు పట్టిందని, చైనా మాత్రం దాన్ని 15 సంవత్సరాల్లో సాధించగలిగిందనీ ఆయన చెప్పాడు.

క్రిందటి సంవత్సరం మనిలాలో జరిగిన 'ఇకెఫే' చర్చలో భారత ప్రతినిధి ఉపన్యాసాన్ని ప్రారంభిస్తూ అన్న విషయాన్ని కూడా ఇక్కడ ఉదహరించాలి.

"ఇండియా పారిశ్రామిక విధానంలో ముఖ్యంగా కనిపించేవి (అ) ఏప్రిల్ 30, 1956 పారిశ్రామిక విధానం తీర్మానం (ఆ )1951 పారిశ్రామికచట్టం (ఇ) పంచవర్ష ప్రణాకలు". విదేశీ పెట్టుబడుల



విజయవాడ ఆర్ టి సి బస్సు డిపో గేటువద్ద సమ్మె సాగుతున్నప్పటి దృశ్యం బస్సు బయటికి రాకుండా గేటు ముందు అడ్డంగా పడుకొనివున్న కార్మికులను, కాపలాకాస్తున్న పోలీసులను ఈ చిత్రంలో చూడవచ్చు.

# న్యూఢిల్లీ లేఖ

పాలును గురించి, ప్రస్తావిస్తూ "నిబంధనల దృష్ట్యా, ప్రారంభానికి మాత్రం అవసరం అయితేనే ఇండియా విదేశీ నిర్వాహక సంస్థలలో పాలు పంచుకుంటుందని" అన్నారు. ప్రాంతీయ దేశాలకు ప్రణాళికను రూపొందించటంలో సహాయాన్ని అందిస్తామనికూడా అన్నారాయన.

జపాన్ ప్రతినిధి తమ ఉపన్యాసంలో "ముఖ్యంగా యంత్రాలు, పరికరాలు మొదలైనవాటిలో ప్రయివేటుపెట్టుబడిమూలంగా ఏర్పడిన విపరీతమైన పెరుగుదల, తద్వారా పారిశ్రామిక, వ్యాపారరంగాల్లోనేకాకుండా ఆర్థికరంగం, ధరలు, ఉద్యోగ రంగం కూడా విపరీత పరిస్థితులు ఏర్పడ్డాయి. ఆ పరిస్థితిని ఎదుర్కొనటానికి రూపొందించిన 1964—68 ఆర్థిక ప్రణాళికలో పెరుగుదల 8.3 శాతం ఉంటుంది. 1959—63 లో 12.3 శాతం ఉంది.

"అలా నెమ్మదిగా పెరుగుదలను తగ్గించుకుంటూ రాబోయే సంవత్సరాల్లో ప్రస్తుతం జపాన్‌లో ఉన్న స్థిరమైన ఆదాయపు స్థాయిని సాధించవచ్చు" అన్నారు.

ప్రస్తుతం ఇండియా పరిస్థితి రెండు సంవత్సరాల్రకితం జపాన్ ఉన్న పరిస్థితికంటే కూడా అధ్వాన్నంగా ఉంది. అయినప్పటికీ రాబడిని వృద్ధి చేసుకోడానికి, చైనా బెదరింపులను అరికట్టటానికి చేసే సూచనలను ఇండియా యింకా పెడచెవిని పెడుతూనే ఉంది.

న్యూఢిల్లీలో జరిగే 'ఇకెఫే' చర్చ అంత తేలిగ్గా అవగాహన అయ్యేదికాదు. అందరికీ తెలుస్తున్నదేమంటే యునైటెడ్ నేషన్స్, 1967 లో అంతర్జాతీయమైన పారిశ్రామిక విధానాన్ని రూపొందించడానికి ప్రయత్నాలు చేస్తున్నదనీ, అందుకు పీఠికగా ఓ అంతర్జాతీయ సంస్థను స్థాపించడానికి సన్నాహాలు చేస్తున్నదన్న విషయమూ. ప్రాంతీయ సంస్థలను, స్థాపించాలన్న ఉద్దేశంకూడా దానికి ఉంది. ప్రపంచ పారిశ్రామిక సర్వేలో ఆసియా పారిశ్రామిక అభివృద్ధి సంఘం విలువైన సూచనలను యిచ్చింది. అందులో చర్చకు సూచించిన కొన్ని ప్రత్యేకాంశాలు :

1. పెట్టుబడిని అధికం చేయడానికి, కేంద్రాలను అభివృద్ధి చెందుతున్న దేశాల్లో స్థాపించాలి.

2. పారిశ్రామికాభివృద్ధిలో విదేశీ ప్రయివేటు పెట్టుబడుల పాత్ర, వాటి నుంచి వచ్చే ఆదాయం అనుశీలించాలి.

3. పారిశ్రామికరంగంలో ప్రభుత్వ సంస్థల పాత్ర పరిశీలించాలి.

క్రిందటి సంవత్సరం మనిలాలో జరిగిన 'ఇకెఫే' చర్చలో, ఆసియా పారిశ్రామిక వ్యవస్థపై సమావేశం దానిలో ఒక భాగంగా జరగాలని సిఫారు చేసింది. సభ్యదేశాలు పారిశ్రామికాభివృద్ధినిగూర్చి తెలుసుకొని తద్వారా సంపాదించిన విజ్ఞానాన్ని, అనుభవాన్ని సమస్యల పరిష్కారానికి వినియోగించుకోడానికి ఈ సమావేశం సహాయపడుతుంది. ఈ సమావేశంలో ఆసియా పారిశ్రామిక సంఘం నిర్వర్తించే కార్యకలాపాలను సమీక్షించి తగు సలహాలను యివ్వడానికి కూడా వీలవుతుంది. మూడేళ్ల వ్యవధితో ఈ సమావేశాలు జరుగుతాయి సమావేశం ఎప్పుడు, ఎక్కడ జరిగేదీ, దానికి ముందుగా చేయాల్సిన ఏర్పాట్లు ఇకెఫే ఎగ్జిక్యూటివ్ సెక్రటరీ నిర్ణయానుసారం జరుగుతాయి. సభ్య దేశాల ప్రభుత్వాలను సంప్రదించి ఆయన వివరాల్ని రూపొందిస్తారు.

ఇండియా ప్రభుత్వానికి తన సచివాలయంలో యిలాంటి సంఘానికి చోటును కల్పించాలన్న ఆసక్తి ఉందా? ఈ సంస్థ వల్ల తేలికగా భారతదేశం చాలా లాభాలు పొందటానికి వీలుంటుంది.

బొంబాయిలో అలెగ్జాండ్రా డాక్స్, బల్లార్డ్ డయర్ అభివృద్ధి పథకాన్ని గురించి మంత్రుల ఉపన్యాసాలు, ఫోటోలు, తదితర ప్రచారం అందరికీ తెలిసిందే. ఈ పథకానికి అయ్యే 18 మిలియన్ డాలర్లు ప్రపంచ బాంక్ అప్పుగా యిస్తున్నది. ఈ రుణానికి 1962 లోనే సంతకాలు జరిగాయి. మొదట అనుకున్న ప్రకారం అది 1967 మార్చి 31 కి పూర్తి కావాలి. కానీ ప్రారంభించటమే మార్చి 31, 1966 తర్వాత జరిగింది. ప్రపంచ బాంక్ సరైన కారణాన్ని గనుక చూపకుండా ఉండి ఉన్నట్టయితే అప్పటి రవాణామంత్రి శ్రీ రాజ్ బహదూర్ రుణ ఒప్పందాన్ని చింపేసి ఉండేవారు. హాల్‌దియా ప్రాజక్టుకు ధన సహాయం కొరకు వేరే ప్రయత్నాలు చేస్తామని కూడా ఆయన అన్నారు. అప్పుడు ప్రపంచ బాంక్ కొన్ని సూచనలను చేసింది. ప్రపంచ బాంక్ రుణాన్ని మంజూరు చేసిన ఒక పెద్ద ప్రాజక్టు పని విషయంలోకూడా రవాణా మంత్రిత్వశాఖ ఎంతో ఆలస్యం చేసింది. ప్రపంచ బాంక్ 60 మిలియన్ డాలర్ల రుణాన్ని మంజూరు చేసిన ఈ ప్రాజక్టు బెంగాల్‌కు ఎక్కువ లాభదాయకమైనది. అసలు రోడ్ వేయడానికి ఎంత సరంజామా దిగుమతి చేసుకోవాలన్న విషయం తేలటానికే కొన్ని సంవత్సరాలు పట్టింది.

—శ్రీకృష్ణ ●



సిమ్లాలోని చౌహా గుడి



హాబవ్ నగర్

# పంజాబ్

సిక్కుమత స్థాపకుడు శ్రీ నానక్ 1469లో లాహోర్‌వద్ద 'తల్వాండి' అనే ఊళ్లో, ఒక ఖత్రీ కుటుంబంలో జన్మించాడు. హైందవ, మహమ్మదీయ మతాల మధ్య వైరుధ్యాన్ని నిర్మూలించటం, దేవుడు ఒకడేనని తెల్పటం, మతాలకి ప్రత్యేకంగా కనిపించే కర్మకాండ గర్హనీయమని తెల్పటం ఆయన ముఖ్యోద్దేశాలు. గురునానక్ 1538లో మరణించాడు. అక్బర్ ఆదరించిన రామ్‌దాస్ (1574—1581) గురునానక్ పరంపరలోనివాడే. అంతేకాక, ఈ గురుపదవి వంశపారంపర్యంగా రావాలని శాసించిందీ ఈయనే.

ఆరవ గురువు అర్జున్‌మల్ (1581—1606) సిక్కు మత విస్తరణకి తోడ్పడటమేకాక, 'ఆదిగ్రంథ్' అనే పుస్తకరూపంలో తనముందు గురువుల, ఇతర హైందవ మహమ్మదీయ సంస్కర్తల సందేశాలని సేకరించాడు. కాని జహాంగీర్ ఆయన పలుకుబడిని అనుమానించి ఆయనని చంపించివేశాడు. దీనితోనే సిక్కులకీ, మహమ్మదీయులకీ విరోధాలు పెరిగి ఉండవచ్చు.

ఆ తర్వాత వచ్చిన గురువులందరిలోనూ ముఖ్యమయినవాడు గురుగోవింద్ (1666—1708). కొందరు కాశ్మీర బ్రాహ్మణుల పక్షం వహించాడని ఈయన తండ్రి తేగ్ బహదూర్‌ని ఔరంగజేబు నిర్బంధించి ఇస్లాం స్వీకరించటానికి నిరాకరించినందుకు మరణశిక్ష విధించాడు. ('శిర్ దియా, సర్ నా దియా'—తల ఇచ్చినా మతాభిమానాన్ని వదులుకోలేదు, అని అర్థం—అన్నారు ఈయనని గురించే.)

గురుగోవింద్‌సింగ్ భారత దేశ చరిత్రలోని మహా పురుషులలో ఒకరని ప్రఖ్యాత చరిత్రకారుడు శ్రీ కాళీంకార్ దత్తా అన్నారు. నేడు సిక్కులు తమ మత చిహ్నాలుగా స్వీకరించే అయిదు 'క' కారాలని ఈయనే వాడుకలోకి తీసుకువచ్చాడు. కేశ్ (పొడవయిన జుట్టు), కంపనా(దువ్వెన), క్రిపాన్ (కత్తి), కచ్చా (పొట్టిలాగు), కరా (ఇనపగాజు)—వీటిని ధరించటం, ప్రతిపేరు తర్వాత 'సింగ్' అని ఉండటం, యుద్ధంలో వెన్ను చూపించక పోవటం, 'పహుల్' అనే సంస్కారాన్ని పొందటం, ఆపదలో ఉన్నవారికి సహాయం చెయ్యటం— ఇవి సిక్కులకి ప్రత్యేకంగా ఉండవలసినవని గురుగోవింద్ చెప్పాడు. గురుగోవింద్ చేసిన ముఖ్య సంస్కరణ గురుపదవి వంశ పరంపరంగా రాకూడదని శాసించటమేనేమో. ఈవిధంగా సిక్కుమతం, తక్కిన మతాలలోలే మతాధికారుల దుష్ప్రభావానికి లోబడకుండా తప్పించాడేమో అనిపిస్తుంది. (నేడు కొందరు హైందవ మతాధికారులకి జరిగే బహిరంగ సన్మానాలు గమనించదగ్గవి!) యజ్ఞోపవీతం ధరించరాదనీ, శకునాలని నమ్మరాదనీ, మద్యపానం పనికిరాదనీ, శిరచ్ఛేదనం చేతచావని జంతువుల మాంసం తినరాదనీ, హైందవుల పుణ్యతీర్థాలని దర్శించరాదనీ, కులభేదాలనీ విస్మరించాలనీ గట్టిగా చెప్పింది కూడా గురుగోవిందే.

1708లో ఒక పఠాన్ గురుగోవిందుని పొడిచి చంపివేశాడు. గోవింద్ తర్వాతి సిక్కుగురువు బాందాని ఢిల్లీ చక్రవర్తి నిర్బంధించి ఏనుగులచేత తొక్కించి చంపించాడు. ఇటువంటి సంఘటనలు సిక్కుల ఐకమత్యాన్ని బాగా హెచ్చు చేశాయి. మూడవ పానిపట్ యుద్ధం తర్వాత సిక్కుల బలం అధికం అవుతూ వచ్చింది. 1773కి పంజాబు ప్రాంతం అంతా సిక్కు ప్రభువుల కిందకి వచ్చేసింది. 12 'మిసల్'లు అనే వర్గాలకింద ఏకం అవుదామని చూసినా ఐకమత్యం లోపించి అంతర్యుద్ధాలు కొంచెం ఎక్కువ అయ్యాయి.

ఈ కలహాలని అరికట్టి వారి నాయకుడయిన వ్యక్తి రంజిత్‌సింగ్. ఈయన 'సుకర్చకియా' అనే మిసల్ నాయకుడయిన మహాసింగ్ కొడుకు. 1792లో తండ్రిని కోల్పోయినప్పుడు రంజిత్‌సింగ్ వయసు 12 మాత్రమే. కాని తన చాకచక్యంవల్ల నెగ్గుకుంటూ రావటమేకాక 19వ ఏట కాబుల్‌రాజు జమాన్‌షాచేత లాహోర్ అధిపతిగా నియమితుడయ్యాడు. క్రమంగా పెరిగిపోతున్న ఇతని పలుకుబడి, బలం అప్పటి బ్రిటిషు అధికారులకి నచ్చలేదు. కాని రంజిత్‌సింగ్ లౌక్యుడు కాబట్టి వారితో యుద్ధం చెయ్యకుండా సంధి చేసుకున్నాడు. చివరికి రంజిత్‌సింగ్ సిక్కులందరినీ ఒక రాజ్యంలోకి తీసుకురాలేకపోయినా భారత చరిత్రలోని ముఖ్య వ్యక్తులలో ఒకడు. ఒక బ్రిటిషు చరిత్రకారుడు ఇతన్ని 'క్రామ్‌వెల్'తో పోల్చాడు. బ్రిటిష్‌వారిని తగినంతగా ఎదిరించకుండా వెనక్కి తగ్గాడని మరొక చరిత్రకారుడు విమర్శించాడు.

ఏది ఎలా ఉన్నా, రంజిత్‌సింగ్ తర్వాత సరయిన నాయకుడులేని సిక్కులు బ్రిటిషు వారికి లొంగిపోయారు. లొంగిపోయినతర్వాత వారికి 'ఆప్తు'లయారు. 1857 తిరుగుబాటులో సిక్కులు బ్రిటిషువారివైపే పోరాడారు. సైన్యంలో వారికి ప్రత్యేకస్థానం లభించటమేకాక, క్రమంగా (మత భేదాలని

అనుసరించి) మహమ్మదీయులతోబాటు రాజకీయాలలోనూ ప్రత్యేకస్థానం సంపాదించుకున్నారు.

* * *

పంజాబీసుబాని విడదీసి ఇవ్వటం పాకిస్తాన్‌ని విడదీసి ఇచ్చినట్లే అంటున్నారు కొందరు. ఇది కేవలం భాషా రాష్ట్ర విభజనే కాబట్టి మద్రాసు, బొంబాయి రాష్ట్రాల విభజనలకి తీసిపోదని మరికొందరు వాదిస్తున్నారు అయితే,గురుముఖి లిపితో పంజాబీ తమ భాషగా స్వీకరించినవారిలో అధికులు సిక్కులే. హిందువులలోఎక్కువమంది హిందీయే తమ భాష అన్నారు పంజాబురాష్ట్రంలో సిక్కులని 'కనిష్ఠవర్గం' వారిగా ఉంచాలని హిందువులు ఈ అబద్ధం ఆడారనికొందరు నిపుణుల అభిప్రాయం. ఈ వ్యాస రచయితకి తెలిసిన పంజాబీ హిందువు ఒకాయన హిందీలో మాట్లాడవలసి వచ్చినప్పుడు, తన భాష పంజాబీ కాబట్టి సరిగ్గా మాట్లాడ గలనో లేనో అని జంకాడు మరొక పంజాబీ సిక్కు స్నేహితుడు తను 'ఖత్రీ' కులంవాడినని గర్వంగా చెప్పుకున్నాడు. కుల విభేదాలని రద్దు చెయ్యాలని ప్రారంభించిన సిక్కులలోనే 'చుహా'అనే కులంనుంచి తమ మతం స్వీకరించిన హిందువులని మిగతా సిక్కులు సమానంగా చూడరుట. ఏదో ఒక నెపం మీద సమాజాన్ని వర్గాలుగా విభజించటం ఈ దేశ ప్రజల ప్రత్యేకత. డ్రా.

# పరిచయం

ఈ ఏభైయ్యో,యిండియన్ సైన్సు కాంగ్రెసుకు హాజరయిన సందర్భంలో పంజాబు రాష్ట్రంలో చూచివచ్చిన ప్రాంతాల్ని గురించి క్లుప్తంగా వ్రాయాలనుంది.

రాష్ట్రముఖ్యపట్టణమైన 'చండీఘర్' యిక్కడి చూడాల్సిన స్థలాల్లో కూడా ముఖ్యమైనదే. ఢిల్లీ నుంచి కల్కావెళ్లే రైలుమార్గంలో 150 మైళ్ళ దూరంలో వుంది. చండీఘర్ ప్రత్యేకతేమిటంటే అత్యాధునికంగా పాశ్చాత్య పట్టణాలను పోలి, పాతదనము మచ్చుకైనా కనపడదు 'లాహోరు' తూర్పు పాకిస్తాన్‌నులో కలిసిపోయిన తర్వాత పంజాబుకు ఆకొరత తీర్చేందుకై కట్టబడింది. నగరం ఒకే వైశాల్యంకల ముప్ఫై సెక్టారులుగా విభజింపబడి, యే సెక్టారుకు, ఆసెక్టారు నిత్యజీవితావసరాలను తీర్చే బజారు, స్కూళ్లు ఆస్పత్రులు మొదలయిన వన్నీ కల్గివున్నాయి. సిటీలో రోడ్డు రవాణా సౌకర్యములు చాలా చక్కగా వున్నాయి ఒక సెక్టారు పూర్తిగా పంజాబు యూనివర్సిటీకి సంబంధించింది. యూనివర్సిటీ వాతావరణం యెంతో ప్రశాంతంగా వుంది యూనివర్సిటీ మధ్యలో పద్మాకారంలో కట్టబడివున్న గాంధిభవన్ ఒకప్రత్యేక ఆకర్షణ. ఇదిగాక హైకోర్టు, సెక్రెటేరియట్ భవనాలు ప్రత్యేకించి చూడాల్సినవి పట్టణానికి ఆనుకొని వున్న 'లేక్సు' బీచిలేని కొరతను తీరుస్తూ మరింత హంగునిస్తుంది. చండిఘర్‌నుంచి పదిహేనుమైళ్ల దూరంలో వున్న 'పింజోరు' లోని మొఘల్‌గార్డెన్సు యిక్కడి సమీపములోని ఒకచక్కని పిక్నిక్ స్థలము. గార్డెన్సు సమీపములో ప్రభుత్వపు హిందూస్థాన్ మెషిన్ టూల్స్ ఫ్యాక్టరీవుంది. బెంగుళూరులో వలెనే యిక్కడ కూడా స్వదేశీ వాచీలు తయారవుతున్నాయ్.



అమృత్‌సర్ బంగారు గుడి

చండిఘర్‌నుంచి 125 మైళ్ళదూరంలో వున్న 'అమృతసర్' పంజాబులో చూడాల్సిన మరొక స్థలము. ఇండో—పాక్ బార్డరుకు చాలా దగ్గరగావుంది. ఇక్కడి బంగారు దేవాలయం మనకందరికీ బాగా తెలిసినదే! శిఖ్ఖులకు యిదిముఖ్య యాత్రాస్థలమైనందున యాత్రికులు చాలామందివస్తూంటారు. 'పాటన్ నగర్' యిక్కడినుంచి పదిహేను మైళ్ల దూరంలోవుంది. ఇక్కడ పాకిస్తాను వైపునుంచి మనవారికి పట్టుబడిన పాటన్ టాంకులు సుమారు వందవరకూ చేర్చబడి, మన విజయానికి తార్కాణంగా వున్నాయ్. ఇక్కడవున్న సైనికోద్యోగులు చూడ వచ్చిన వారిపై చూపే ఆదరణ ప్రశంసనీయము.

పంజాబులో చూడాల్సిన స్థలాల్లో మరొకటి భాక్రానంగల్‌ప్రాజెక్టు. మామూలుగా ఒకటిగా పిలువబడినా, భాక్రా, నంగల్ రెండూ దగ్గరో వున్న వేరువేరు ప్రదేశాలు. భాక్రాడామ్ సట్లెజ్ నది నీటిని గోవిందసాగర్‌లో నిలువచేసి, పంజాబు రాష్ట్రాన్నే కాక, యెడారి ప్రాంతమైన రాజస్థాన్‌నుకూడా సస్య శ్యామలము చేస్తుంది. భాక్రాలో వుత్పత్తి అయిన విద్యుచ్ఛక్తితో నడుపబడుతూన్న 'నయా

56 వ పేజీ చూడండి

# పుస్తకాలు

## జ్ఞాననేత్రం

వాచస్పతి రచన. క్రౌనుసైజు 164 పుటలు వెల రూ 2—50 ప్రకాశకులు సర్వోదయ పబ్లిషర్సు, విజయవాడ—2

ఈకథానికల సంపుటంలో 'జ్ఞాననేత్రం' మున్నగు ఎనిమిది కథానికలు ఇదివరలో వివిధపత్రికల్లో ప్రకటించ బడినవే ఉన్నవి 'రాధ' అనే మొదటి కథలో మధ్య తరగతికి చెందిన సామాన్య కుటుంబపు పరిస్థితులు వర్ణించబడినవి. అందంలేని అనాకారి రాధ తనకు వివాహయోగ్యత లేదని గ్రహించి, స్వతంత్రించి తన జీవితంకోసం ప్రయత్నించడం ఇందులోచక్కగా చిత్రించ బడినది 'జీవితానికి అర్థం' అనే రెండోకథలో తన జీవితం వ్యర్థమనే భావంతో ఆత్మహత్యకు ప్రయత్నించిన 'రాఘవ' బ్రతుకుకోసం కుటుంబ పోషణకోసం ప్రాకులాడుతున్న ఒక బిచ్చగానివల్ల సంసార తత్వం గ్రహించి మనస్సు మార్చుకొన్న పరిస్థితి చక్కగా రూపించ బడినది రంగుటద్దాలు అనే మూడవకథలో విద్యావతియై, ఉన్నత సంస్కారం ఉండి, జీవితంలో ఎలాంటి దెబ్బలూ ఎరుగని యువతి వైరాగ్యం పొందిన సంగతి,ఆమె విచిత్ర ప్రకృతి చిత్రించ బడినవి 'పాప' అనే కథలో పసిబాలల చిత్తవృత్తి, నిర్మమ—మత్వం, పసివాళ పై ఎక్కువ వ్యామోహం పెట్టుకున్న పెద్దవాళ నిరాశా వర్ణించ బడినవి 'మనుషులూ, మమతలూ,' అనేఅయిదవ కథలో తల్లిదండ్రులు లేని బాలిక వివాహంగురించీ, అత్తారింటికి పంపడాన్ని గురించీ విభిన్నాభి ప్రాయాలుగల సోదరులు, ఆమె ఆత్మ హత్యా ప్రయత్నంతో ఏకాభి ప్రాయానికి వచ్చిన సంఘటన స్వాభావికంగా చూపబడింది. 'మాతృదేవి'' అనే కథలో భర్త హీనయైన ఒక యువతి ఇద్దరు పసిబిడ్డలను విడిచిపెట్టి, ఒక యువకునితో లేచిపోవుటకు సంకల్పించినా, ప్రయాణం కూడా అయినా, సగందారిలోనే మనసుమార్చుకుని యింటికి వచ్చి, బిడ్డల యెడల తన మాతృప్రేమను ప్రకటించిన సంఘటన కూర్చ బడినది 'జ్ఞాననేత్రం' అనే ఏడవకథ తక్కినవాటికి మకుటాయమానంగా ఉన్నది తాము కుటుంబాలతో తిండికికూడా కష్టపడుతూ తమ్ముడిని డాక్టరు పరీక్షకు చదివించడమూ, ఆతమ్ముడు రాజుకు కుటుంబ పరిస్థితులు తెలిసి, మనస్సుకు ఎంతో బాధ కలగడమూ, చదువుకొనసాగించ డానికి కావలసిన ధనంకోసం ఇష్టంకాని పెండ్లికి సోదరుల ప్రయత్నమా అది విఫలంకాగా, రాజా మిక్కిలి తృప్తిపడి డాక్టరు చదువుమాని, ఉపాధ్యాయవృత్తి స్వీకరించడానికి నిశ్చయించడమూ, అతన్ని ప్రేమించిన మహిళ చూపిన త్యాగబుద్ధీ, చివరకు సంకల్ప సిద్ధీ ఎంతో చక్కగా, స్వాభావికంగా చూపబడ్డాయి. చివరి 'మనిషి— దేవుడు' అనే కథలో విద్యాధికుడయినా, తండ్రి ధనాశకు బలియై, పతితురాలిని పెండ్లి చేసుకుని, మనస్సు విడిచి తన స్థితిని చెప్పిన ఆమె యెడల సానుభూతి చూపలేని— హృదయం లేని యువకుని విచిత్ర తత్వం, తల్లిప్రేమ యీ కథలోఉన్నవి ఇందులోని కథ లన్నిటిలోనూ ఇది చివరిదిగానే ఉండడం— ఇందలి అస్వాభావికపు విషయాలను కొన్నింటిని బట్టి ఉచితంగానే ఉన్నది.

మొత్తం మీద కథలన్నీ చాలా పొందికగానే కూర్చబడినవి. ఒకటి, రెండు కథలలోని కొందరు వ్యక్తుల మనస్తత్వాలు స్వభావానికి దూరంగా ఉన్నట్లు తోచినా, కథలు చక్కగానే సాగిపోయి, రచయిత సామర్థ్యాన్ని వ్యక్తపరుస్తూ ఉన్నవి.

—ఆంగీరస

## నీలి తెరలు

(కథల సంపుటి రచన. శ్రీ దేవినేని శ్రీరామమోహనరావు ప్రచురణ: మంజులత పబ్లికేషన్స్. ఏలూరు వెల. రూ 1—50.)

ఈ సంపుటిలోవున్న నాలుగు కథల్లో నలుగురు కథానాయకులు రెండు విధాలుగా వున్నారు. మొదటి ఇద్దరూ పెళ్ళయి, చనిపోయారు. చివరి ఇద్దరూ పెళ్ళికాక, బ్రతికిపోయారు. ఇందులో రెండురకాల ప్రమాదాలున్నాయి ఒకరకం ప్రమాదాల్లో పాత్రలు చనిపోయాయి అవిరెండు. 'వాకీ జీవితం ఎందుకు'లో కథానాయకుడు కారుప్రమాదంలో మరణించాడు 'నీలి తెరలు' కథానాయిక రైలుప్రమాదంలో చనిపోయింది. ఇక చావుదప్పిన ప్రమాదాలు . అవిరెండు. కృష్ణలో కొట్టుకుపోతున్న సుజాతను శీను రక్షించాడు. లాంచిలోంచి గోదావరిలోపడి, మునకలు వేస్తున్న రాధను బోటులో వున్న మోహన్ బ్రతికించాడు. ఇక శోభనం గదులు. అవి రెండు. రామారావు శారదల, శీను సుజాతల శోభనం గదులు, వాటిలో వారివారి హావభావాలు ఓపినంతగా వున్నాయి. సంపుటిలో ద్వైతం బాగా కనిపిస్తుంది

పద్దెనిమిదేళ్ల వసుంధరతో, తాత ధర్మారావు, పదిహేనేళ్లనాటి విషయం చెబుతాడు. శీను స్త్రీని రక్షించటం— కాలేజీలోవాళ్లు చదువు పూర్తి చేసి పెళ్లి చేసుకోవటం, పాప పుట్టటం— వసుంధర అని నామకరణం చేయటం—ఆ వసుంధరే ప్రస్తుతంలో కథవింటున్న పద్దెనిమిదేళ్ల వసుంధర కావటం—కాలం అవరోధంవల్ల—వింతగావింటుంది ఈ తప్పు తేలికగా తొలగించుకోవచ్చు.

భాషాదోషాలు తక్కువకాదు కొన్ని పదాల స్వరూపం అర్థం తెలుసుననే వీల్లేదు. వాక్యాలకు— కొన్నింటికి—తలా తోకా కనిపించలేదు (పొగ)'సూటిగా తన కళ్లలోకి చొరబడి ఉక్కిరి బిక్కిరవుతూ', 'హో ముద్దు కురిపించేడు'. 'మీరే నాకు పాదసేవకులు......మామీద ఎనలేని గూళ్లు కట్టుకొన్నాను' ఇలాంటివి చాలా వున్నాయి. కథా శిల్పంలోగానీ రచనా నైపుణ్యంలోగానీ, భాషా ప్రయోగంలోకానీ జాగ్రత్త లేదు. ప్రయత్నంవుంది. 'దాగుడు మూతలు' లో ఒక చిన్న మెరుపుంది. 'దూరపు కొండలు'లోకొంతంత కథానికా శిల్పం వుంది

భాషను అభివృద్ధి చేసుకొంటే, వాక్య నిర్మాణం అలవర్చుకొంటే, కథల్లో అనవసర విషయాలు చెప్పటం విడిచిపెడితే, శిల్పం గ్రహిస్తే, పాత్రల స్వభావాలు నిశితంగా ఆలోచించివ్రాస్తే, ఏనాటికయినా రచయిత విషాదాంత కథలు బాగా వ్రాయొచ్చుననే వూహ మాత్రమే కలిగిస్తుంది కథల సంపుటి.

## చక్కని చుక్కలు

(ప్రవాసాంధ్ర ప్రముదల ప్రత్యేక రచనలు. ప్రకాశకులు ఆంధ్ర విజ్ఞానసమితి, విర్దినివాస్ : ఎస్‌రోడ్, జమ్‌షెడ్‌పూర్, బీహార్. సంపాదకుడు : వఝ్ఝల కాళిదాసు వెల 75 పైసలు.)

ఇందులో వ్యాసాలూ, కథలూ, పద్యాలూ ఉన్నాయి. రచనలు అన్నీ స్త్రీలే రచించటంవల్ల పరిమితంగా క్రొత్తదనం కనిపించటంవల్ల ప్రత్యేకత మాట ఎలా ఉన్నా, ఆవేశంమాత్రం బాగా ఉంది.

వ్యాసాలలో విషయ విస్తరణ తృప్తిగాలేదు. 'కాలము—ధర్మము'లో విషయ ఔన్నత్యం తగ్గింది అల్ప విషయ ప్రతిపాదన అధికమయింది అయినా రచనా విధానంవల్ల ఆలోచింపజేసే వ్యాసమిది. గత కాలధర్మం, వర్తమాన కాల ధర్మంతో ఏవిధంగా పోటీ పడుతుందో చూపిన వ్యాసభాగం ముచ్చటగా వుంది. సంఘ శ్రేయస్సు దృష్టితో, భిన్నత్వంలో ఏకత్వం సాధించే ప్రయత్నంతో, వ్యక్తికీ, వ్యక్తికీ మధ్య అంతరాలు తగ్గాలనే వూహ చూపే 'అన్యోన్యం'లో, ఆవేశంలో ఉదాహరణల్లో అల్పత తగ్గితే బాగుండేది.

వూహాలోకంలోని మూర్తి మనస్తత్వం, వాస్తవ జీవితంలో సృష్టింపబోయి, అతిశయోక్తి చూపిన రచన 'వంకర దారులు' సంఘసేవా కార్యక్రమాలు సాగించే ఉద్దేశంతో ఒకచోట కూడిన స్త్రీలు, అత్యవసర స్థితిలో ఎలా వెనకడుగువేసేది, కీర్తి అపకీర్తిలకు ఎలా ప్రాకులాడేది, చూపుతూ, నిజంగా సంఘాభ్యుదయం కాంక్షించే స్త్రీలు ఎలా బాధలు పడేది ఇతివృత్తంగా సాగిన కథ 'ఆదర్శ మహిళా సంఘం' ఈ కథ ఒక ప్రశ్న! ఒక సవాలు! కమల, మిసెస్ రావుకంటే, అప్పలమ్మ, పంతులమ్మ కళ్లల్లో మెదులుతారు అనవసర విషయాలు, వర్ణనలు, ఉపన్యాసాలు తగ్గిస్తే ఇది చక్కని కథ!

ఈ పుస్తకంలో స్త్రీ ఆధిక్యమూ ఉన్నాయి. భాషాదోషాలు పూర్తిగా తొలగింపబడలేదు. వాక్యాలు రెండూ మూడూ అన్వయ క్లిష్టత్వంతో ఉన్నాయి. అయినా ప్రవాసి చక్కని చుక్కలు—చూడవచ్చు.

—రవి.

# బ్రతుకు భయం

జె. రామచంద్రమూర్తి

చాలాకాలంనుండీ వ్రాయాలనుకుంటున్నాను . కానీ భయం. మీరు చదువుతారని నాకు భయంలేదు అసలు చదవాలనే వ్రాయటం! కానీ భయం . . నా భయాన్ని చూసి మీరు నిద్రాహారాలు మానేసి నవ్వుతారేమోనని నాకు ఏమాత్రము భయంలేదు కానీ నేను భయపడుతున్నట్లుగానే—ఇంకా—ఎందరో—భయపడుతున్నారనే నా భయం ! ....

* * *

నేను గుమాస్తాని! .... బ్రతకాలనే మంచి ఉదేశ్యంతో నా చదువుసంధ్యలనూ—తెలివితేటలనూ—ఒక సంస్థకు కౌలుకిచ్చి—అడుగడుక్కూ భయపడుతూ బ్రతుకుతూన్న మామూలు గుమాస్తాని! . . గుమాస్తానని నాకు భయంలేదు. . అలా అని చెప్పుకోవటం నాకు గర్వం ! .... "చేస్తే 'ప్యూన్' గా నైనా చేయాలి—లేకపోతే 'గెజెటెడ్ ఆఫీసరయి' నా కావాలి" అని అంటూంటాడు మా మిత్రు డొకడు నిజమే ! . 'గుమాస్తా' అంటే అందరూ ఎందుకో చిన్నచూపు చూస్తారు . ఒక్క మా మావగారు తప్ప!.... ఎందుకంటే—నేను ఒక 'సాదా గుమాస్తా'ని అని తెలిసుండి కూడా ఆయన పిల్లనిచ్చాడు నాకు ఆరోజున—ఆయనకు గుమాస్తాలందరి తరపున కృతజ్ఞతలు చెప్పుకున్నాను.

* * *

మా ఆఫీసులో పనిచేస్తున్న అవధానికి పెళ్లి అయిన కొత్తలో—అంటే అయిదు సంవత్సరాల క్రితం—కొని ఇస్తానన్న రేడియో కనీసం వచ్చే సంకురాత్రికైనా వాళ్ల మావగారు కొంటారో లేదో నని భయం!

మాఆఫీసరుగార్కి తనపై ఎవరో పిటీషన్ పెట్టినందువల్ల రాబోయే ప్రమోషన్ ఆగిపోతుందేమోనని భయం.

ఇరవై అయిదో తారీఖున—జేబులో మిగిలిన అరవై ఆరు నయాపైసలతోనూ—తక్కిన ఆరు రోజులూ గడుస్తాయో లేదోనని—నా భయం !!!

* * *

మా ఆఫీసరు 'క్యాంపు' కు వెళ్లాడు ఎప్పుడూ తరగని పనిని ఆనాటికి కట్టేసి—సరిగా అయిదయ్యేసరికి ఆఫీసులో నుండి బయటపడ్డాను నీరెండ చాలా బాగుంది ఆడుకున్న బడిపిల్లలు హుషారుగా కేకలు వేసుకుంటూ గృహోన్ముఖులవుతున్నారు. అలసిపోయినవారి చిన్నారి ముఖాల్లో ఆనందం వెల్లివిరుస్తోంది. బస్‌స్టాప్ దగ్గర నిలబడిన నాకు—నా చుట్టూ ప్రపంచం ఎంతో వింతగా, సర్వాంగసుందరంగా కనిపించింది ఆరోజు బస్ వచ్చింది. నాకు ఎందుకో ఎక్కాలనిపించలేదు నాకోసం బస్ ఆగలేదు .. నేను బయల్దేరాను. కాసేపు 'టాంక్‌బండ్' మీద కూర్చున్నాను. ఆ తరువాత అక్కడకు కొంచెం దూరంలో ఉన్న 'టీ స్టాల్'కు వెళ్లి టీ త్రాగాను మనస్సెంతో తేలికయింది. ఆలోచిస్తూనే నడుస్తున్నాను. ఏదో మత్తెక్కించే మధురమైన సువాసనతో వాస్తవానికి వచ్చి చూశాను. ఎవరో రిక్షాలో వెడుతున్నారు. అతను ఆమెతో నవ్వుతూ ఏదో చెబుతున్నాడు ఆమె ఎందుకో చాలా సిగ్గుపడి పోయినట్లు కనిపించింది. వాళ్లకు ఏమీ భయాలు లేవు కాబోలు—ప్రపంచాన్ని జయించినట్లు ధైర్యంగా కనిపించారు. ఆమె తలలో మల్లెలు—వాటి పరిమళమే కాబోలు నన్ను మత్తెక్కించింది.

ప్రపంచంలో ఎన్నో రకాల పువ్వులుంటాయి. అందులో కొన్నింటికే అంతటి సువాసన ఎందుకో ? .మానవుల మాదిరిగానే పువ్వులు కూడా తమ తమ పూర్వ జన్మ సుకృతాల ననుసరించి కర్మ ననుభవిస్తాయేమో అనిపిస్తుంది. కొన్ని పుష్పాలు మాలలై, భగవానుని హృదయంపై , తల దాచుకుని తరిస్తాయి మరికొన్ని మరణించిన మానవులతో కలసి స్మశానంలో బూడిద అయిపోతాయి.

ఆలోచిస్తున్న మనసును లక్ష్యపెట్టకుండా— అలవాటుపడ్డ కాళ్లు—నన్ను గమ్యానికి లాక్కుపోతున్నాయి. దారిలో అయిదు పైసలు పెట్టి పాతిక మల్లెపూలు కొన్నాను కొన్న తరువాత అనుకున్నాను 'చాలా తెలివితక్కువపని చేశానని !'....నిజమే—ఒకటో తారీఖు ఇంకా ఆర్రోజు లుండగా—ప్రతి పైసనీ—ఒక రూపాయిగా చూడవలసిన నేను వాడిపోయి రాలిపోయే వాటికోసం అయిదుపైసలు అనవసరంగా వినియోగించటం తెలివి తక్కువ కాదని ఏ గుమాస్తా మాత్రం అనగలడు ? జేబులో చేయిపెట్టి చిల్లరను బయటికి లాగాను ఇంకా అర్ధరూపాయి మిగిలిఉంది.

ఇంటికి చేరుకునేసరికి ఏడు గంటలు కావచ్చింది . అంటే రోజూకన్న దాదాపు రెండు గంటలు ముందుగానే ఇంటికి వచ్చానన్నమాట ! . ముందుగా వచ్చినందుకూ, మల్లెపూలు తెచ్చినందుకూ శాంత ఎంతో మురిసిపోతుం దనుకున్నాను కానీ అలాగేం జరగలేదు !! శేఖరానికి 'డింగీ' జ్వరమట! వళ్లు సలసలా కాగిపోతోంది . ఉదయము స్కూలునుండి రాగానే తలనొప్పి అని పడుకున్నాడట నాలుగయ్యేసరికి జ్వరం తగిలి చీకటిపడే వేళకు ఎక్కువయిందట. వళ్లు తెలియకుండా పడుకొని ఉన్నాడు

"డాక్టర్ని పిలిస్తే బాగుంటుంది" అని శాంత సలహా యిచ్చింది.

"నిజమే ! డాక్టర్ని తీసుకరావాలి! శేఖరానికి జ్వరం వెంటనే తగ్గిపోవాలి మా పెళ్లి అయిన మొదటి రెండు సంవత్స

లాగా మేం అనుభవించిన ఆనందానికి చిహ్నం శేఖరం! అందుకే వాడంటే ఎంతో గారాం! 'రాజశేఖరం' అని పెద్దవాళ్ల పేరు పెట్టుకున్నాం..... కనీసం శేఖర మయినా ఒక గెజెటెడ్ ఆఫీసరయితే చూడాలని మా ఆశ! ఏమైనా శేఖరానికి జ్వరం వెంటనే తగ్గిపోవాలి.!.... గబగబా డాక్టరుగారింటికి వెళ్లాను. లేరని తెలుసు కొని తిరుగుముఖం పట్టిన నాకు—దారిలో ఆయన ఎదురయ్యారు. సంగతి చెప్పి వెంటనే రమ్మన్నాను. ఆయన ముఖం ఇబ్బందిగా పెట్టాడు.

"సారీ బ్రదర్! ఇప్పుడే చాలా దూరం నుండి వస్తున్నాను. అయినా ఆజ్వరానికి



మరేం భయపడక్కరలేదు ఈ 'మాత్ర' కొని వేస్తే అదే తగ్గిపోతుంది"—అంటూ కాగితంమీద 'ప్రిస్క్రిప్షన్' ఇచ్చాడు... మంచి మనిషి గనుక ఆమాత్రమయినా చేశాడు. మరొక డయితే మనతో అసలు మాట్లాడేవాడా? శాంత నీరసంగా ఉంటోం దంటే 'కాల్షియం ఇంజక్షన్లు' ఇచ్చాడు క్రిందటి నెలలో! అదే నెలలో పాపకు కుక్క కరిస్తే పొట్టమీద పన్నెండో, పదమూడో ఇంజక్షన్లు ఇచ్చాడు. కానీ నే నింతవరకూ ఆయనకు ఫీజేమీ ఇవ్వ లేకపోయాను. నేను గుమాస్తానని ఆయ నకు తెలుసు!...

## బ్రతుకు భయం

దారిలో ఉన్న మందులషాపుకు వెళ్లి చీటీ చూపించాను. మాత్రను పొట్లం కట్టి యిచ్చి—బిల్లు వ్రాసి యిచ్చాడు. రూపాయి ముప్ఫయి పైసలు ఏం చేయను? నేను తరచుగా ఆ షాపులోనే మందులు కొంటూంటాను. గౌరవంగా బ్రతికే 'గుమా స్తానని' వాళ్లకి తెలును. అందుకే నా దగ్గర డబ్బు లేదని చెప్పలేకపోయాను.... "పోనీ తరువాత యిస్తానంటే?" ఎదురుగుండా 'అరువు రేపు' అనే బోర్డు—నాకోసమే కట్టినట్టుగా వ్రేలాడుతోంది. నాలోని అభిమానం—నే నున్నానంటూ గుర్తుచేసింది

జేబులో చెయ్యి పెట్టి "సారీ! డబ్బు తీసుకరావటం మరచిపోయాను. ఉంచండి! మళ్లీ వస్తాను!" అంటూ బిల్లూ, మందు పొట్లాం అక్కడే ఉంచి వెనక్కు తిరగ బోయాను.

"పరవాలేదండీ! రేపివ్వండి డబ్బు!" అంటూ వాటిని నా ముందుకు త్రోశాడు షాపు యజమాని. అతని చిరునవ్వూ—సహృదయతను సూచించే కళ్లూ—నాకు యిప్పటికీ బాగా జ్ఞాపకం!.... "మను ష్యుల్లో మంచివాళ్లు లేకపోలేదు"—అనుకున్నాను.

గబగబా వెళ్లి శేఖరంచేత మాత్ర మింగించాను. రాత్రి రెండు గంటలకు కాబోలు జ్వరం కొంచెం దిగజారింది.

మరునాడుదయం నా జేబులోనే నలిగి వాడిపోయిన మల్లెపూలు చూసి చాలా బాధపడింది శాంత.

"ఎప్పుడూ బుద్ధిపుట్టి తీసుకువే రారు! తెచ్చినా వాటిని పెట్టుకునే యోగం నా కుండద్దూ? క్రితం నెలలో కాబోలు జానకమ్మగారు ఇస్తే పెట్టు కున్నాను." అంటూ నాకు వినిపించే విధం గానే తన బాధను వ్యక్తంచేసింది శాంత! నాకు కోపం రాలేదు. ఎందుకో నాకు జీవితమంటే మొదటిసారిగా విరక్తి పుట్టింది.

మా పెళ్లయి పదేళ్లయింది. కనీసం ఏ నాలుగయిదు సార్లో తనకు నచ్చిన చీరలు కొని యిచ్చానేమో? ఎప్పుడూ యంత్రంలా పనిచేస్తూ—ఉన్నా లేకపోయినా అల్లరి పెట్టకుండా సంసారాన్ని నెట్టుకొని వస్తోంది శాంత!.... ఏ ఆస్తిపరుణ్నో పెళ్లి చేసుకుని ఉంటే ఎంత సుఖపడేది?..... అసలు "గుమాస్తాలు పెళ్లి చేసుకో కూడదు"—అని ప్రభుత్వం శాసిస్తే ఎంత బాగుణ్ను?!!

* * *

ఆ మర్నాడు మరచిపోకుండా ఇంటికి వచ్చేటప్పుడు మళ్లీ మల్లెపువ్వులు కొని తీసుక వచ్చాను. పువ్వులు పెట్టుకుంటే శాంత చాలా అందంగా కనబడింది ఆ రాత్రి, శాంత చెప్పింది—నేను మరో పాపకు తండ్రి కాబోతున్నట్టు!! నెత్తిమీద ఎవరో సుత్తి పెట్టి కొట్టినట్లనిపించింది నాకు. నా పరిస్థితి నాకే భయం కలిగించింది.... ఉన్న ముగ్గురు పిల్లలకూ—ఏ ఒక్క పండు గకూ ఒక్కసారిగా బట్టలు కొనలేక పోయాము. ఆ ముగ్గురికీ లభిస్తున్న సౌకర్యాలను పంచుకునేందుకు మరొకరు పుట్టబోతున్నారన్నమాట!....నిజంగా నాకది ఒక భయంకరమైన సమస్యే మరి!.

ఎన్నో సమస్యలు అడుగడుక్కూ ఎదు రవుతూ—బ్రతుకంటేనే భయమనిపిస్తు న్నాయి. ..నా చిన్నతనంలో చదువుకునే టప్పుడు 'సోషల్ స్టడీస్' మాస్టారు' చెప్పే

వారు—'ఒక మనిషి బ్రతకటానికి ముఖ్యముగా కావలసినవి మూడు—తిండీ, గుడ్డా, వసతి అని!.... వస్తే్తిది.... ఆ మూడూ కాదు .... ఏదో పుస్తకంలో ఎవరో వ్రాశారని—చెప్పిన మాటలవి. అది చెప్పటానికి ఆయన 'జీతం' తీసుకుంటున్నాడు కనుక విజ్ఞాన్ని మభ్యపరచి—జీవితమంటే ఏమిటో తెలియని పసివాళ్ల హృదయాలను ప్రక్కదారికి మళ్లించాడు! బ్రతకాలంటే ముఖ్యంగా కావలసింది డబ్బు! డబ్బుతో ఆ మూడే కాదు—మరో ముప్పైమూడు కూడా పొందవచ్చు. డబ్బుంటే భార్య అవసరం ఉండదు. అప్పుడు సంతానానికి అవకాశమే ఉండదు. ఆ రెండూ లేనప్పుడు సమస్యల ప్రసక్తే ఉండదు. ఎన్నైనా తప్పుడు పనులు చేసి, డబ్బుతో వాటిని కప్పిపుచ్చుకోవచ్చు! ఎవరో అన్నట్లు—భగవంతుడు సృష్టించిన మనిషికన్న ఆ మనిషి సృష్టించిన డబ్బునే మిన్నగా గుర్తిస్తుందీ లోకం! చదువు లేకపోయినా ఫరవాలేదుట. 'డబ్బు లేనివాడు మాత్రం వింతపశువు !''—నేను కూడా డబ్బు సంపాదిస్తే ఎంత బాగుణ్ణు ? నా ఉద్దేశ్యంలో 'జీతం' వేరు ! డబ్బు వేరు !.... సమస్యల్ని సృష్టించేది 'జీతం!' వాటిని దూరం చేసేది డబ్బు!—అందుకే 'జీతం' వేరూ—'డబ్బు' వేరూ అన్నాను!'' ఆ డబ్బే ఉన్నవాడు నలుగురు కాదుకదా—మరో నలుగురు పుట్టినా నాకు భయమనిపించదు. అందరకూ పెద్ద చదువులు చెప్పించవచ్చు. ఆస్తిపరుల్ని చూసి అమ్మాయిలకు పెళ్లిళ్లు చేయవచ్చు.

*  *  *

“మీరీ సహాయం చేస్తే నాకీ ఏటికి తడుముకో నక్కరలేదు! నా క్కొచ్చేదాంట్లో నాలుగో వంతు—మీకు ముందుగా కావాలన్నా ఇవ్వటానికి నాకు అభ్యంతరంలేదు... ఆరోజు ఆఫీసునుండి ఇంటికి తిరిగి వస్తోంటే దారిలో తగిలిన—ఆ పెద్ద మనిషి మాటలవి! నేను మనసంగానే వడుస్తున్నాను. నేను అతనికి ఆ సహాయం చేస్తే తనకు వచ్చే రెండునేల రూపాయల లాభంలోనూ నాకు నాలుగోవంతు అంటే అయిదు వందలు బహుమతి యిస్తానన్నాడు. ఏమీ శ్రమపడకుండా అయిదు వందలు సంపాదించవచ్చు! అంటే దాదాపు మూడు నెలలకు సరిపడ్డ జీతం.... శాంతకు మంచివి నాలుగు చీరలు కొనవచ్చు. డాక్టరుగారికి పాత ఫీజంతా ఇచ్చేయవచ్చు!.... కానీ ముందున్నది జీవితం! నా భావి జీవితానికి మచ్చ పడకూడదు!.... అది నేను ఏనాడో చేసుకున్న నిర్ణయం !.... అందుకే బాగా ఆయనకు జవాబు చెప్పాను. 'అంతటి పరచన నేను చేయలేను. మీరు వెళ్ళవచ్చు!' అని! ఆ పెద్దమనిషి తోక ముడిచాడు. కానీ మర్నాడు అతను మళ్లీ ఆఫీసుకు వచ్చాడు. తిన్నగా ఆఫీసరు గదిలోకి వెళ్లాడు. చాలాసేపు ఇద్దరూ మాట్లాడుకున్నారు. నవ్వుకున్నారు. కాఫీలు త్రాగారు. ఆ తరువాత రెండు గంటలకు ఆఫీసరు నన్ను పిలిచాడు. ఆ కాగితాల గురించి అడిగాడు. అది 'రికమెండ్' చేయటానికి వీలుపడదని చెప్పాను. నిబంధనలకు

వ్యతిరేకమని కూడా చెప్పాను. "అవినీతి నమువరించి నిబంధనలను 'సోవర్ లుక్' చేయూ''అన్నాడు. నేను గుమాస్తాని! అందుకే తల ఒంచుకున్నాను. "నీకు చేతులు రాక పోతే ఆ 'పేపర్స్' ఇటు పడేయ్!" ఆదేశం రాడు ఆఫీసరు. వెంటనే వాటిని అయన కు ఇచ్చేశాను. పని జరిగిపోయింది. పెద్దమనిషి నావైపు వెలితిగా చూసి నవ్వుతూ విశ్లేషించాడు. ఆ సాయంత్రం నన్ను ఆఫీసరు పిలిచాడు.... వెళ్లాను.

"చూడు మోహన్! నీకు ముగ్గురు పిల్లలున్నారు! నువ్ మామూలు గుమాస్తావి. ఆస్తిపాస్తులు లేనివాడివి. ఈ రోజు లేటు కంటేనో నీకు తెలియనిది కాదు. బొత్తిగా నీతి కట్టుక కూర్చుంటే పిల్లల భవిష్యత్తు ఏమవుతుందో ఆలోచించావా? మనం ఒకడికి ఉపకారం చేయటం, వాని వల్ల మనం ప్రత్యుపకారం పొందటం తప్పు కాదు" అంటూ ఆఫీసరు తన కోటుజేబు లోంచి రెండు వంద రూపాయల కాగితాలు బయటకుతీసి నాకు ఇవ్వబోయాడు!

"క్షమించండి సార్! ఇంకా నాకు అటు వంటి జీవితం అలవాటు కాలేదు''—అంటూ బయటకు వచ్చేశాను.

"మనం ఒకడికి ఉపకారంచేసి వాడివల్ల ప్రత్యుపకారం పొందటం తప్పుకాదు''—ఆఫీసరు మాటలు అడుగడుక్కీ నా చెవిలో మారు మ్రోగుతున్నాయి. కానీ ఇక్కడ ఉపకా

# బ్రతుకు భయం

రానికీ ప్రత్యుపకారానికీ అవకాశంలేదు. నీతిగా, నిజాయితీగా మన ధర్మాన్ని నిర్వర్తించమని ప్రభుత్వం మనల్ని నియమించి అందుకు మనకు 'జీతం' ఇస్తోంది. కానీ, ఆ ధర్మాన్ని విస్మరించి అర్హత గల వానిని అడుక్కి త్రొక్కి అనర్హుడికి అన్యాయంగా ఉపకారం చేయటం 'మోసం' అవుతుంది. వానివల్ల పొందే ప్రత్యుపకారం 'లంచం' అనిపించుకుంటుంది. ఆఫీసరు మాటల్లోని అంతరార్థం ఏమిటి? అతనికి పిల్లలు లేరు. భార్యవల్ల తరగని ఆస్తి లభించింది. మరి ఇంకా ఎందుకీ నీతిలేని పనులు?

ఆలోచిస్తూనే ఇంటికి వచ్చేశాను. ఆరాత్రి శాంత అంది—"సుభద్ర వండక్కి నెక్లెస్ చేయించుకుంటోంది''—అని. సుభద్ర ఏం చేసినా శాంత దృష్టిలోకి మరు క్షణములో వచ్చేస్తుంది. వాళ్లు మా పక్క వాటాలోనే ఉంటున్నారు. సుభద్ర భర్త కూడా నాలాగే మామూలు గుమాస్తా. కానీ అతనికి 'రాబడి' ఎక్కువ! ఏడాదికి ఒకసారి 'దేవుని పేర వ్రతం' చేస్తుంటాడు. వచ్చే 'చదివింపుల' తో భార్యకు నగలు చేయిస్తుంటాడు.

"మీరు కూడా 'వ్రతం'చేయకూడదూ" అంది ఒకసారెప్పుడో శాంత.

"ఎందుకూ? మనకి బట్టలు పెట్టటానికి మీ నాన్నగారికి అనవసరంగా ఏభయి రూపాయల ఖర్చు''—అన్నాను నేను..... మళ్లీ ఆ మాట ఎప్పుడూ అనలేదు శాంత!!!

ఆ రోజులనుండీ ఎదురుచూసిన ఒకటో తారీఖు వచ్చింది. జీతం తీసుకున్నాను. సాయంత్రం ఇంటికి వచ్చేస్తూంటే ఆఫీసరు పిలచాడు. దగ్గరకు వెళ్లి ఆయన యిచ్చిన కాగితం తీసుకున్నాను. చదువుకున్నాను. నా కాలిక్రింద నున్న నేల కదులుతున్నట్లు, కళ్ళు చీకట్లు క్రమ్మినట్లూ అయిపోయింది. చాలా కోపం వచ్చింది. ఆ కోపంలో ఆఫీసరు గొంతు నులిమి పారేయా అనిపించింది. కానీ నేను మామూలు గుమాస్తాని. కోపాన్ని అణచు కోవటం నాకు ఉగ్గుతో పెట్టిన విద్య. మాట్లాడకుండా ఇంటికి వచ్చేశాను. తెచ్చిన జీతాన్ని శాంత చేతిలో పెట్టాను.

"ఎప్పుడూ లేనిది డబ్బంతా నాచేతికి యిస్తున్నా రేమిటి?'' అన్నది శాంత నవ్వుతూ!

"ఇది నా ఆఖరి జీతం కనుక!"

శాంతకు అర్థం కాలేదు. జేబులోంచి కాగితం తీసి యిచ్చాను.

"ఏమిటిది?'' అంది—దాన్ని అటూ యిటూ త్రిప్పిచూసి.

"నేను నమ్ముకున్న ధర్మానికీ,నా నీతి నిజాయితీలకూ విలువకట్టి ఇచ్చిన బహుమతి పత్రం!"—నా మాటలు శాంతకు పూర్తిగా బోధపడలేదు. విడమరచి చెప్పాను. "నేను ఒకరి దగ్గర అయిదు వందల రూపాయలు లంచం తీసుకొని పనిచేసి పెట్టానుట. అందుకని అసలు విషయాన్ని పరిశోధించి నిజానిజాలు తెలుసుకునేంతవరకూ నన్ను 'సస్పెన్షన్' లో ఉంచారు''—అని!

ఎంక్వయిరీలో నిజానిజాలు బయటపడతాయా? నమ్మకం ఎక్కడ?.... నేను గుమాస్తాని!.... నా మాట నమ్మే దెవరు? నన్ను చూసి వెకిలిగా నవ్విన ఆ 'పెద్ద మనిషి'—భయంకరమైన ఆ 'నిజాన్ని' బయటపెడతాడని నమ్మక మెక్కడ?... ●









బోర్న్‌విటా పోషకత్వమునకు సముచితమైనది. కండరములు మరియు టిష్యూలను బలపరచుటకు ప్రోటీన్‌లు, బలము మరియు శక్తి కోసం కార్బొహైడ్రేటులు, ఎముకలను దృఢముగా చేయుటకు ఖనిజ లవణములు మరియు ఆరోగ్యమునకు అతి ముఖ్యమైన విటమిన్‌లు మీకు లభించును. బోర్న్‌విటా తయారు చేసుకోవడం సులభం మరియు అది రుచిగా కూడా నుండును

## క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా

BENSONS/1-CT-29




పండితులు వాదించుకున్నట్లుగా వైజ్ఞానికులుకూడా వాదించుకుంటారు. తృణీకారాలూ చేసుకుంటారు గాని, అవి పండితుల విమర్శలంత బండగా ఉండవు. పండితుల స్వార్థము ప్రధానంగా బాగా కనబడిపోతుంది, వారిబలము గౌణముగా ఉంటుంది. వైజ్ఞానికుల వాదములలో ఉన్న బలము కాస్త పైనే కనబడుతుంది, వారి స్వార్థము గౌణముగా వుంటుంది. వైజ్ఞానికుల వాదన వారి సాక్ష్యసంపద మీదనే ఎక్కువగా ఆధారపడుతుంది. పండితుల వాదన వారికీర్తి ప్రతిష్ఠలమీద ఆధారపడుతుంది. సాక్ష్యాన్ని గుర్తించి వైజ్ఞానికులు తమ అభిప్రాయాలు తప్పని ఒప్పుకుంటారు. పండితులు తమ సాక్ష్యాన్నేగాని ఎదిరి సాక్ష్యాన్ని గుర్తించరు. కనక పండితుల వాదాలు పురాణ జ్వరాల్లాగా కాలముగడిచినా కలత మానవు. వైజ్ఞానికుల వాదాలు విర్ణాయక సాక్ష్యముతో సరి.

ఎడిసన్ వెస్టింగ్‌హౌసుల వాదన మహా జోరుగా సాగినా తర్వాత పూర్తిగా చల్లారిపోయింది! ఎడిసన్ విద్యుద్దీపాన్ని నిర్మించిన రోజులలో దీపాల ఉపయోగము బాగా వ్యాపించాలని న్యూయార్కు పట్టణంలో కొంత భాగానికి ఎలక్ట్రిసిటీ సప్లై చెయ్యడానికని పెద్దకంపెనీపెట్టి డి. సి. విద్యుత్తు సప్లై చేశాడు. డి. సి.విద్యుత్తు తీగలలో ఒకేదిక్కుకి ప్రవహించేవిద్యుత్తు. నదీప్రవాహము మెట్ట నేలలనుంచి పల్లపు నేలలకు సాగినట్లు డి. సి. విద్యుత్తు పవర్ హౌసులోని డైనమోయొక్క ధన ధ్రువము (Possitive Pole) నుంచి ఊరంతటా తిరిగే తీగెలో ప్రవహించి పవర్ హౌసులోని డైనమో ఋణధ్రువానికి చేరుతుంది.ఇలాగ చేరే విద్యుత్తు వేగము సెకనుకు 1,86,000 మైళ్లు. ఇక ఎ.సి.విద్యుత్తు అనేది ఊయ్యాలమాదిరిగా పవర్‌హౌసులోని డైనమో ఒక ధ్రువమునుంచి బైలుదేరి ఊరంతా ఉన్న తీగెలో కదిలి తిరిగి పవర్‌హౌసులోని డైనమో రెండో ధ్రువానికి చేరుతుంది. ఇలాగసెకనులో 50వంతు కాలముగడుస్తుంది. ఆతర్వాత విద్యుత్తు డైనమో రెండో ధ్రువమునుంచి బయలుదేరి అప్రదక్షిణముచేసి మొదటి ధ్రువానికి చేరుతుంది. ఇదీసెకనులో 50వవంతు కాలమే ఈమాదిరిగా ప్రవహిస్తుంది. అలాగ ఎ. సి. విద్యుత్తు సెకనుకు 50మారులు దిశమారుతుంది. డైనమో అనే విద్యుదుత్పాదకయంత్ర నిర్మాణదశలో ఎ. సి. విద్యుత్తు సృష్టి అయింది. దానిని ప్రత్యేక సాధనాలు నిర్మించుకుని డి. సి. గామార్చుకున్నారు. నేటివాటా విద్యుదుత్పాదన ఎ. సి., డి. సి. లనే రెండు రకాలలో జరుగుతోంది ఎక్కడేనాను, ఎడిసన్ డి. సి. ని వాడేడు.

వెస్టింగు హౌసు, 'ట్రాన్సుఫార్మర్' అనే ఉపయోగ కరమైన సాధనాన్ని నిర్మించాడు. దానివల్ల తక్కువఒత్తిడి గల ఎక్కువ విద్యుత్ప్రవాహాన్ని ఎక్కువ ఒత్తిడి గల తక్కువ ప్రవాహంగా మార్చుకోవచ్చునూ, దీన్ని దానిగా మార్చుకోవచ్చును. అయితే ఈ మార్పులు ఎ. సి. విద్యుత్తుకే సాధ్యము. కనుక వెస్టింగ్ హౌసు ఎ. సి. నివాడడము మంచిదన్నాడు.

ఎడిసన్ చేసిన విద్యుద్దీపాలు పాయ్యిలూ ఎ. సి. , డి. సి. లకు రెండింటికీ అవే ఉపయోగించుకోవచ్చును. అయితే ఎలక్ట్రిక్ ఫాన్‌లూ మోటారులూ మాత్రం దేనికవే వాడాలి. తాను ప్రతిష్ఠచేసిన డి. సి. కన్నా ఎ. సి. మంచిదని చెప్పడమేమిా అని ఎడిసన్ పట్టుదల. తాను నిర్మించిన ట్రాన్సుఫార్మర్ ఎ. సి. తోనే బాగా ఉపయోగపడుతుందికదా అని ఎ. సి. యొక్క లాభాల్ని గట్టిగా చెప్పడము వెస్టింగు హౌసు పట్టు.

డి. సి. ప్రవాహమువల్ల ప్రాణాపాయము తక్కువ. 220 ఓల్టుల ఎ. సి. తగిలి చచ్చిపోతారు, 220 ఓల్టుల డి. సి. తగిలినా మరణము కలిగించక పోవచ్చు. డి. సి. ట్రాముకారులు కదిపి నడపడానికి సహాయ్యకారి. అంతమాత్రమే. డి. సి. ని ఒక నగరమంతటికీ ఒకేపవర్ హౌసువల్ల సప్లై చెయ్యలేరు. చివరలకు పోనుపోనూ డి. సి. ఒత్తిడి తగ్గిపోతుంది, ప్రవాహమూ తగ్గుతుంది. మహానగరానికి సప్లై చెయ్యాలంటే ఒక్క డి. సి. పవర్‌హౌసు చాలదు. చాలా కట్టుకోవాలి. ఎ. సి. కి ఈచిక్కులేదు. పవర్ హౌసులో తయారయే విద్యుత్తు యొక్క ఒత్తిడి ప్రవాహబలమూ ఏవి అయినా, వాటిని ట్రాన్సుఫార్మర్లఫాయము వల్ల, ఎక్కువ ఒత్తిడిగల తక్కువ ప్రవా

హామూ, తక్కువ ఒత్తిడిగల ఎక్కువప్రవాహముగా మార్చుకోవచ్చును. పవరు హౌసులో ఒక ప్రత్యేకపుఒత్తిడి(Voltage)తో తయారు చేసిన విద్యుత్తును గ్రామములకైతే ట్రాన్సుఫార్మర్‌తో ఎక్కువ ఒత్తిడి తక్కువ ప్రవాహముగా మార్చుకోడానికీ, ఇళ్లలోకి అయితే తక్కువ ఒత్తిడి ఎక్కువ ప్రవాహముగా మార్చుకోడానికీ వీలు. వీటికి తోడు ఎ. సి. కి ఉన్న గొప్పసౌకర్యము, దూరాలకు పంపడంలో శక్తి వష్యముకాదు. కనక పవర్ హౌసును ఊరికి పడుమ కట్టనక్కరలేదు. ఊరవతలకట్టవచ్చును తీగలు కూడా, హెచ్చు ఒత్తిడి గల ఎ. సి. విద్యుత్తుకి సన్నవి వాడవచ్చును.

కనక వెస్టింగ్‌హౌసు హెచ్చు ఒత్తిడితో ఏ. సి. ఉత్పత్తి చేశాడు. తీగలు తెగినప్పుడూ, ఎవడేనా వాటిని తగిలినప్పుడూ అపాయాలు జరిగితే న్యూసుపేపరులు మహా అడావిడి చేసేవి. ఎడిసన్ కూడా "నగరాలమీద అంత అపాయకారి తీగలేమిటి?" అని రాశాడు. ఉపన్యాసాలిచ్చాడు. వెస్టింగుహౌసు "తుపాకిమందూ, కత్తీ అపాయాలు కావా, అలాగే విద్యుత్తూనూ, బుద్ధిలేనివాడు డైనమోవి మింగితే ఎవరేమిచెయ్యగలరూ?" అంటూ రాశాడు. కాలక్రమాన్న తీగలు భూమిలో వేయగల ఉపాయాలూ సాధనాలూ వృద్ధి చేశారూ, కొందరు భయపెట్టినట్టుగా అలా భూగర్భంలో వేసిన తీగెలవల్ల అపాయమురాలేదు. ట్రాన్సుఫార్మర్లు వాడి విద్యుత్తును చాలా మచ్చిక చేయువచ్చునూ, ఎలక్ట్రిక్కు రేజరూ, క్లీనర్లూ వంటివెన్నో వాడుకోవచ్చును. ఎడిసన్ చివరికి ఎ. సి. యే అనుకూలమైనదని ఒప్పుకున్నాడూ, 20వ శతాబ్ద ప్రారంభకాలానికే ఈ వివాదము పూర్తిగా అంతరించిపోయింది. ●




**జ రి గి న క థ**

జీవితంమీద విరక్తితో ఆత్మహత్య చేసుకోబోతున్న రాధను, రక్షిస్తాడు ఆ ఊరి డాక్టరు వేణు. వేణుకు తన దయనీయ జీవితగాధనంతా వినిపిస్తుంది రాధ. సామాన్య గృహస్థు రామనాథం గారికి ముద్దుబిడ్డలు ప్రకాశరావు, రాధ. కాని చిన్నతనంలోనే తండ్రిని కోల్పోతారు. మ్యాట్రిక్ పైవరకు ప్యాసయిన రాధను ఒక మంచి సంబంధమే అనుకుని, భాస్కరానికిచ్చి పెళ్లిచేస్తాడు అన్న ప్రకాశరావు కాని భాస్కరాన్ని గురించి వారూహించినదంతా పొరపాటని తెలుస్తుంది. పైగా డబ్బు కోసం రాధ పుట్టింటివారిని తరచూ పీడిస్తుంటాడు భాస్కరం.

## 4

రోజులు గడిచిపోతున్నాయి. మళ్లీ సంక్రాంతి పండుగ కూడ వచ్చింది. రాధని గురించిన దిగులుతోనే శాంతమ్మగారు కృంగి పోతున్నారు.

వోరోజున ప్రకాశమే అన్నాడు. "అమ్మా నువ్వేమి అనుకోనంటే వోమాట చెప్తాను. ఆ రెండెకరాలు బేరం పెడదాం. ఇప్పటికే దానిమీద వెయ్యి రూపాయలు పైగా అప్పు ఉందిగా. అది తీర్చి ఈ మోటారు సైకిలేదో కొనిచ్చి, ఇంకా ఏమైనా మిగిలితే నీపేర బ్యాంకులో వేద్దాం. పొలం మీద అప్పు తెస్తే మాత్రం వడ్డీ పెరగడమే కాని, తీర్చే మార్గం ఏముంది ? అందుకే ఏకంగా అమ్మేస్తే బాగుంటుం దని ఉంది.

అసలు ఆ రెండెకరాలు కాజెయ్యా లని వాళ్లకి దుర్బుద్ధి పుట్టింది. అందుకే ఈ హిరణ్యాక్ష వరాలన్నీ. అది పూర్తిగా అమ్మివాళ్ల మొఖాన్న పడేసి, ఇంక మాదగ్గిరేం లేదు బాబూ ఇంతటితోనైనా మమ్మల్ని కరుణించి వదిలిపెట్టండని నమస్కారం చేద్దాం నా కింతకన్న మరో మార్గం కనిపించడంలేదు.

నీ పొలం అమ్మమంటున్నానని నీవు మరోలా అనుకోకు. అది నీ ఖర్చులకోసం అవసరాల కోసం నాన్నగారు వ్రాశారు. కాని పరిస్థితులిలా వచ్చాయి. నీకు గుప్పెడు మెతుకులు పెట్టలేని అప్రయోజకుడిని కాను నేను. నిన్ను నెత్తిన పెట్టుకు పూజించలేకపోయినా, నీ కేలాంటి లోపం మాత్రం జరగనివ్వను. ఏదో విధంగా రాధ కాపరం బాగుపడాలనే నా తహతహ అమ్మా. ఏమంటావు రాధా! నువ్వు కూడ ఏదైనా ఆలోచన చెప్పు"

"ఒద్దన్నయ్యా. అడిగినప్పుడల్లా ఇస్తున్నకొద్దీ మనం మరీ అలుసయి పోతాం. అసలక్కడి మనుష్యు లెలాంటి వారో మీకు తెలియదు. ఇంక ఆ ఇంట్లో నేను ఉండలేను. నా కేదైనాఉద్యోగం చూసిపెట్టు. నేను నీకు భారంగా ఉండ దలచుకోలేదు." అంది రాధ తలొంచుకుని.

"నువ్వు నాకు భారమని కాదు తల్లీ. ఇరవైఏళ్లు కూడ లేవు నీకు. ముందు జీవితం అంతా ఒంటరిగానే గడుపుదా మనుకోడం అవివేకమమ్మా. చూద్దాం. వాళ్లకీ ఒక్క అవకాశం ఇద్దాం. దీనితో నైనా నువ్వు సుఖపడేరోజు లొస్తాయేమో.

అమ్మదగ్గరేదో ఉందని వాళ్లకి తెలుసు కదా. అందులో నాక్కూడా వాటా లేకుండా అంతా వాళ్లే కాజేయా లనే దురాశ పుట్టింది. అదీ ఇంకా ఎప్పటి దాకానో ఆగలేక ఇప్పుడే చేజిక్కించుకోవా లని ఈ ప్రయత్నాలన్నీ. పొలం పూర్తిగా అమ్మేశామని తెలిస్తే ఇంకే మడుగు తారులే. ఏమంటావు చెప్పు." అంటూ చెల్లెలి సమాధానం కోసం ఎదురు చూశాడు. రాధ అంగీకరించనట్లు మౌనంగా తల వంచుకుంది.

"సరే. నీ యిష్టం వచ్చినట్లే కానియ్యి నాయనా. ఎవరికైనా అది సుఖపడడమే కదా కావాలి. నీకేమీ ఇవ్వలేకపోతున్నానే అనే బాధ మాత్రం నాకు మిగులుతుంది. పోనీ బంగారం అయినా కోడలి కిచ్చాను కాదు. అప్పుడు అది అమ్మి డబ్బు అల్లుడి కిచ్చేస్తే పొలంలో సగం వాటా నీకుంటుంది కదా అనుకున్నాను." అంది శాంతమ్మగారు బాధపడుతూ.

"నువ్వు ఇవ్వకపోవడం ఏమిటమ్మా! ఇప్పుడు నే ననుభవిస్తున్నదంతా నాన్నగారిచ్చింది కాదా. నాన్నగా రొకటీ నువ్వొకటేనా! నువ్వేం మనస్సులో పెట్టుకోకు."

ప్రకాశం ఆ మాటలంటూంటే కామాక్షి మూతి మూడు వంకర్లు తిప్పుకుంటూ వెళ్లిపోయింది. అసలు భాస్కరం దగ్గర నుండి ఉత్తరం వచ్చిన రోజు నుండి ఆమె అత్త ఆడబిడ్డలతో సరీగ్గా మాట్లాడడం లేదు. ఇంట్లో మనిషేకదా అని శాంతమ్మగారు అన్ని విషయాలు చెప్పబోతే కూడ "ఆ రహస్యాలన్నీ నా కెందుకులెండి" అని విదిలించుకుని వెళ్లిపోయేది.

తరువాత పది రోజులకే పొలం అమ్మకం జరిగిపోయింది. పాత అప్పులు తీర్చి, వో అయిదు వందలు బ్యాంకిలో వేసి, బావగారు అడిగిన మూడువేల అయిదు వందలు తీసుకుని, చెల్లెల్ని వెంటబెట్టుకుని అగ్రహారం ప్రయాణం అయాడు ప్రకాశం.

డబ్బు తీసుకుని, ఏమీ జరగనట్లే మామూలుగా అతన్ని మర్యాద చేసారు వాళ్లు. అతను వోరోజు ఉండి వచ్చేస్తూ, గదిలోకి వెళ్లి భాస్కరం రెండు చేతులూ పట్టుకుని, "బావా ! మా రాధని నీ చేతులలో పెట్టాం. దాని మంచి చెడ్డలను చూసుకునే భారం అంతా నీదే. అమ్మకున్న పొలం కూడ అమ్మేసి డబ్బు తీసు

కొచ్చాను. ఇంక ఒక్క కానీ కూడ ఆవిడ దగ్గర లేదు. నువ్వు అప్పుగా అడిగినా కూడ, అది ఎటూ మీకు రావలసిన డబ్బేకదా అనే ఉద్దేశ్యంతో ఏకంగా పొలం అమ్మేశాను. అందులో సగం నా కివ్వాలని అమ్మ అనుకునేది. కాని నాకు నాన్నగా రిచ్చిందే చాలునని అంతా రాధకే ఇచ్చేయ మన్నాను.

నాకూ సంసారం పెరుగుతోంది. బాధ్యతలు పైన బడుతున్నాయి. ఏ పండగకో తీసుకెళ్లి పదిరోజులు నాదగ్గ రుంచుకుని పసుపు కుంకం యిచ్చి పంపించ గలను కాని, నా శక్తికి మించిన కోరికలు కోరితే తీర్చలేను. నా అశక్తతకి నన్ను మన్నించాలి." అంటూ చెమర్చిన కళ్లను ఒత్తుకున్నాడు.

"నా కెందుకండీ మీ డబ్బు. మీరు పుచ్చుకోకపోతే రాధకే యిచ్చేస్తాను." అన్నాడు భాస్కరం చిరునవ్వు చిందులాడుతూండగా.

"వస్తా మరి బావా. వస్తానమ్మాయి వారానికో ఉత్తరం అయినా వ్రాస్తూండు ఏమిటో మరీ అశ్రద్ధ చేస్తావు." అంటూ వెనుదిరగబోయాడు.

ఎంత ఆపుకున్నా ఆగని కన్నీళ్లు చెంపలమీద జలజల రాలుతూండగా ఒక్క పరుగున వెళ్లి అన్నగారికి పాదాభివందనం చేసింది. ప్రకాశం చెల్లెల్ని లేవదీసి అక్కున జేర్చుకుని కన్నీళ్లు ఒత్తాడు ఆ రెండు బాధాతప్త హృదయాలూ మూగగానే మాట్లాడుకున్నాయి. వర్షించడానికి సిద్ధంగా ఉన్న కళ్లతోనే వీడ్కోలు చెప్పి భారంగా అడుగులు వేసుకుంటూ వెళ్లిపోయాడు ప్రకాశం.

మర్నాడే మోటారు-సైకిలు వచ్చింది, అది కొనిపించి యిచ్చినందువల్ల భార్య మీద అభిమానం ఏమీ పెరగలేదు భాస్కరానికి. ఇక ఆ జీవితం అంతేనని నిరాశ చేసుకుని రోజులు భారంగా వెళ్లదీస్తోంది. రాధ. తను క్షేమంగా ఉన్నట్లు మాత్రం తల్లి వాళ్లకి ఏ పదిహేను రోజులకో వో ఉత్తరం వ్రాస్తుండేది.

రెండు నెలలు గడిచాయి. హఠాత్తుగా వో అర్ధరాత్రి పిడుగువంటి వార్త అందింది.

రాత్రి తొమ్మిది గంటలదాకా భర్త యింటికి రాకపోయేసరికి, రోజుల తరబడీ పట్నంలో ఉండిపోవడం అతనికి మామూలే కనక, అలాగే ఉండిపోయా డనుకుంది రాధ కాని పన్నెండు గంటల ప్రాంతాల్లో అతని స్నేహితులు ఇద్దరు సైకిళ్లు వేసుకొని వచ్చి ఆ విషాదవార్త చేరవేశారు.

వాళ్లిద్దరూ సినిమా నుండి తిరిగి వస్తున్నారుట. ఒక దగ్గర వో పిప్పయిపోయిన మోటారు సైకిలు, దానికి కొంచెం దూరంలో ఒక మనిషి కనిపించారుట.



కుతూహలం కొద్దీ దగ్గరికి వెళ్లేసరికి, ఆ మనిషిని తమ స్నేహితుడుగా గుర్తించి అతనిని ఆ అచేతనావస్థలోనే ఆస్పత్రిలో జేర్పించి ఆ ఖబురు చెప్పడానికి ఇక్కడికి వచ్చారుట.

ఇక ఆ మాటలు విన్న దుర్గాంబగారు గుండెలు బాదుకుంటూ ఏడవడం మొదలుపెట్టింది. కోడలిని చూసి జాలిపడడానికి బదులు ఆమెవల్లనే తన కొడుకుకీ దుర్గతి కలిగిందని నిందించడం మొదలుపెట్టింది. అది వినలేక గదిలోకి పారిపోయి హృదయం పగిలేలా రోధించింది రాధ. ఆమెను వోదార్చడాని కెవ్వరూ వెళ్లలేదు.

బయటనుండి అత్తగారి ఏడుపు, మధ్యలో వ్యాఖ్యానంలా ఆవిడంటున్న మాటలు వినిపిస్తూనే ఉన్నాయి. "ఆ దిక్కుమాలిన మోటారుసైకిలమ్మా. ఎంత మనసుపడి అడిగాడో మా నాయన. అడగ్గానే యిచ్చారా ? ఎంత గొడవ, ఎంత రొష్టు. వాళ్లు ఏడుస్తూ యిచ్చినందుకు ఆ ఏడుపే కొట్టిందమ్మా.

దీనిదేం శనిజాతకమో. ఇది ఇంట్లో పాదం మోపిన దగ్గరనుండీ మా కష్టి కష్టాలే ఇంక నా పిల్లవాడు మాత్రం నాకు దక్కుతాడా." ఇలా రకరకాలుగా కోడల్ని సాధిస్తూ తెల్లవారగట్ల అయిదు గంటలదాకా ఆవిడ ఏడుస్తూనే ఉంది.

అప్పుడు మొదటి బస్సుకి అత్తగారు, వాళ్లు బయలుదేరి వెళ్తూంటే తన నెవరూ పిలవకపోయినా, "నేనూ వస్తా" నని బయలుదేరింది రాధ.

"నువ్వెందుకు. ఈ దౌర్భాగ్యాన్ని కూడ వెంటబెట్టుకుని వెళ్లనా ?" అని గర్జించింది అత్తగారు.

"పోనీ. రానీ అమ్మా. తనకి మాత్రం బాధగా ఉండదూ." అన్నాడు పెద్ద కొడుకు.

అత్తగారు, మామగారు, బావగారు, రాధ బయలుదేరి వెళ్ళారు. వాళ్ళు వెళ్ళేసరికే అంతా అయిపోయింది. వాళ్ళు చేయ వలసినవన్నీ చేసి శవాన్ని అప్పగించేసరికి మధ్యాహ్నం అయింది. ఆ సాయంత్రం వరికే దహన సంస్కారాలు పూర్తిచేసు కుని ఇంటికి తిరిగి వచ్చారు.

మర్నాటికి శాంతమ్మగారు ప్రకాశం వచ్చారు. కూతుర్ని కౌగలించుకొని హృద యము పగిలేలా రోదించిందావిడ. ఎవరి సుఖం కోసం అయితే తన సర్వస్వం ధారపోయడానికి వెనుదీయలేదో, ఆ కూతు రుకి జీవితంలో ఇంక ఏ సుఖం లేకుండా పోయినందుకు ఆ మాతృ హృదయం ఎంత రోదించిందో చెప్పడానికి మాటలు చాలవు. ప్రకాశం కూడ చెల్లెల్ని చుట్టేసి కుమిలి కుమిలి ఏడ్చాడు.

వాళ్ళు వచ్చిన కొంచెం సేపటికే దుర్గాంబగారు మళ్ళీ తన పాత ధోర ణిలో ఏడుపు మొదలుపెట్టింది. వాళ్ళకి కష్టం అనిపించినా ఏమీ అనలేక ఊరు కున్నారు.

కర్మకాండంతా ముగిసిన తరువాత శాశ్వతంగా ఆ యింటిని విడిచిపెట్టేసి తల్లి వాళ్ళతో కలిసి పుట్టింటికి వచ్చే సింది రాధ.

వాళ్ళు వచ్చేసరికి కామాక్షి లేదు. భాస్కరం పోయిన వార్త చేరే ముందే ఆవిడ పుట్టింటికి వెళ్ళింది పురిటికి. ఇంట్లో పనిపాటలన్నీ శాంతమ్మగారు ఒక్కతే చేసుకోవలసి వచ్చింది. ఓ పది హేను రోజులలోనే ఆవిడ– ఆరోగ్యం పూర్తిగా పాడయిపోయింది. అసలు అల్లుడు పోయిన ఖబురు వింటూనే కొద్ది క్షణాలు స్పృహలేకుండా పడిపోయిందావిడ. అప్పటినుండి అంతంత మాత్రంగానే ఉంది ఆవిడ ఆరోగ్యం. అలాగే లేని శక్తి తెచ్చు కుని అన్ని పనులు సవరించుకుంటుం డేది. ఏదైనా సాయం చెయ్యడానికి రాధ వెళ్తే...

# నిరీక్షణ

"ఒద్దమ్మా, ఒద్దు" అని వారించేది.

వాళ్ళు వచ్చిన దగ్గర నుండి ఎవరో బంధువులు పరిచయస్థులు వచ్చి పరా మర్శిస్తుండేవారు. వాళ్ళని చూడగానే శాంతమ్మగారు భోరున ఏడ్చేస్తుండేది. రాధ మాత్రం మౌనంగా తల వంచు కుని కూర్చునేది.

"ఎందుకు వీళ్ళందరూ పనిగట్టుకుని వచ్చి నా గత స్మృతులను రేపటానికి ప్రయ త్నిస్తారు ? నా ఏకాంతాన్ని భంగం చెయ్య డానికి వీళ్ళకేం హక్కుంది." అని తనలో తనే చికాకు పడుతూండేది.

వాళ్ళు వచ్చిన నెల్లాళ్ళకి పార్వతి వచ్చింది. బండి దిగగానే రాధ సంగతి చెప్పింది వాళ్ళమ్మ. వెంటనే స్నేహితురాల్ని చూడ్డా నికి పరుగెట్టుకుంటూ వచ్చింది. రాధని కౌగలించుకుని కుమిలి కుమిలి ఏడ్చింది. రాధ ఇన్నాళ్ళనుండి నిగ్రహించుకుంటూ వచ్చిన దుఃఖం ఒక్కసారి పొంగి పొర్లిన ట్లయింది. తనివిదీరా ఏడ్చి హృదయంలో ఇన్నాళ్ళూ పేరుకున్న దుఃఖభారాన్ని కొంత వరకు తీర్చుకుంది. రాధ దాంపత్య జీవితం లోని కష్టసుఖాలు కొంతవరకు పార్వ తికి తెలుసు. అక్కడ తను పడుతున్న బాధలన్నీ తల్లికి వాళ్ళకి కూడ చెప్పేది కాదు కాని, ఓసారి సంక్రాంతి పండు గకు వచ్చినప్పుడు పార్వతి కలిస్తే అన్ని విషయాలూ తనకి చెప్పుకుంది రాధ.

"పద్దెనిమి దేళ్ళకే జీవితంలో అన్నీ అయిపోయాయా రాధా. ఇంకా నీ వయసు వాళ్ళకి చాలమందికి పెళ్ళిళ్ళు కూడా కావడంలేదు. మన కుటుంబాలు ఇంకా పూర్వ సాంప్రదాయాలు పట్టుకుని పాకు లాడే వాళ్ళు కనుక మనకి పదిహేనేళ్ళు వచ్చేసరికే పెళ్ళి పెళ్ళంటూ తొందర పడ్డారు. ఎంత తొందరపడినా, మనం సుఖపడాలనే ఉద్దేశ్యంతోనే చేస్తారుకదా. నీ విషయంలో ఆ దైవమే అన్యాయం చేశాడని చెప్పాలి. అందుకే అతనున్న రోజులలో నయినా సుఖపడే గీత లేక పోయింది."

"కొన్నాళ్ళు పోయాక పైకి చదవడాన్ని ప్రయత్నించు రాధా. ఈ దుఃఖాని మరిచిపోడానికి, కాలక్షేపానికీ కూడ వీలుంటుంది. ఏదైనా ఉద్యోగం దొరకడానికి అవకాశం ఉంటుంది." అంటూ రాధని అనేక విధాల ఓదారుస్తూ ఓ గంటసేపు కూర్చుంది.

"కానీ, నువ్వు ఉన్నన్నాళ్ళు వస్తూం డమ్మా పార్వతీ. చిన్ననాటి స్నేహితులం. నీ దగ్గరైనా అది హృదయభారం తీర్చు కుంది కాని, ఇన్నాళ్ళూ ఒక్కరోజూ కూడ ఏడవలేదు. ఎప్పుడూ కళ్ళు మూసు కుని, తలుపులన్నీ వేసుకుని ఆ చీకటి గదిలో కూర్చునేది. దీనికి మతి కూడ చలిస్తుందా ఏమిటి భగవంతుడా అని నేను బెంగపెట్టుకుని చస్తున్నా ననుకో. ఇంతకీ నేను దురదృష్టవంతురాల్ని. ఇవన్నీ చూడ్డా నికే ఇంకా బతికి ఉన్నాను. దీని జీవితం ఎలా వెళ్తుందో ఏమిటో నా కంత అగమ్య గోచరంగా ఉంది. పార్వతమ్మ తల్లీ." అంటూ ఆమెని పట్టుకుని బావురుమంది శాంతమ్మగారు. ఆవిడ క్కూడా నాలుగు ఉపశమన వాక్యాలు చెప్పి వెళ్ళిపోయింది పార్వతి.

శాంతమ్మగారి ఆరోగ్యం రోజురోజుకి దిగ జారిపోవడం మొదలుపెట్టింది. డాక్టరుకి చూపిస్తే హై బ్లడ్ ప్రషర్ అనీ, పూర్తి విశ్రాంతి అవసరం అనీ చెప్పాడు.

అప్పటికి కామాక్షికి పురుడొచ్చి ఇరవై రోజు లయింది. "నెలలోపునే పంపించమని వ్రాసేస్తాను" అన్నాడు ప్రకాశం.

"అంత తొందరపడి వచ్చి ఆవిడ మాత్రం ఏం పనులు చేయగలదు ? మూడో నెలలో రావచ్చులే. ఎలాగో నేనే తంటాలు పడతాను" అని వారించిం దావిడ.

మరో పది రోజులు గడిచాయి. ఉన్న ట్లుండి కళ్ళు తిరిగి పడిపోయిం దావిడ. ప్రకాశం, రాధ కలిసి ఎలాగో మంచం మీద పడుకోబెట్టారు. డాక్టరు వచ్చి ఇంజక్షనిచ్చాడు. ఏవో మందులు కూడ వ్రాసిచ్చాడు. రక్తపుపోటు ఎక్కువగా ఉందనీ, విశ్రాంతి అవసరం అనీ అది వరకు చెప్పిందే మళ్ళీ చెప్పాడు.

"ఇంక నువ్వు మొండితనం చేసి తిరిగితే నే నూరుకోనమ్మా. వదినొచ్చిందాకా ఇంటిపన్లు నేను చేస్తున్నే." అంది రాధ.

"అయ్యో, నువ్వా తల్లీ?" వో రాగం పెట్టిందావిడ.

"మరేం ఫరవాలేదులే నేను ఆరోగ్యంగానే ఉన్నానుగా. నువ్విలా మంచంమీదనైనా కొన్నాళ్లపాటు ఉండకపోతే నే నేమైపోతానమ్మా. నా కోసం అయినా నువ్వు డాక్టరు చెప్పినట్లు మందులు విశ్రాంతి తీసుకోవాలి." అంటూ బ్రతిమాలుకుంది ఆవిడ ప్రక్కలో కూర్చుని.

తరువాత వో పదిరోజులకి కామాక్షి వచ్చింది. ఆవిడ వచ్చాక కూడ ఇద్దరి పిల్లలతో ఆవిడకి తీరదని సగం పని రాధే చేస్తూండేది. తల్లి సంరక్షణ భారం కూడ తనమీదే ఉండేది.

ఆనాడు వేసిన పడక, ఆవిడ మళ్లీ మామూలుగా లేచి తిరగలేదు కాలకృత్యాలు తీర్చుకోడానికి, బలవంతంమీద రెండు మెతుకులు తినడానికీ తప్ప అసలు ఆవిడ లేచేదే కాదు అలా మంచంమీద పడుకొని గంటల తరబడి శూన్యంలోకి చూస్తూ, తీరని మనోవ్యాధితో రోజు రోజుకీ కృశించిపోసాగింది

మధ్య మధ్య కొడుకుని పిలిచి, "రాధనేం చేస్తావురా. దాని భారం నీదే" అంటూ అతని చెయ్యి పట్టుకుని కళ్లనీళ్లు పెట్టుకునేది.

"రాధని నా కడుపులో పెట్టుకుని కాపాడతానమ్మా. తను నా బిడ్డే అనుకుంటాను. నువ్వు తనకోసం ఏమీ బెంగ పెట్టుకోకు. అయినా నువ్వు ధైర్యం తెచ్చుకుని లేచి తిరిగి తనకి ధైర్యం చెప్పాలి కాని, నువ్వే ఇలా దిగులు పడిపోతూంటే చిన్నపిల్ల తనేమయిపోతుందో ఆలోచించావా?" అనేవాడు ప్రకాశం.

"అయిపోయింది నాయనా నా జీవితం దాన్ని గురించిన చింతతోటే ఇంకా పోకుండా ఉంది. నా ప్రాణం నువ్వు దాని విషయంలో మాట యిచ్చావంటే నిశ్చింతగా చచ్చిపోతా."

"పోనీ అది యిష్టపడితే, చదువుకోడాని కేమైనా వీలుకుదురుతుందేమో కనుక్కోరాదూ" అంది ఆవిడ వోరోజు.

"అలాగేనమ్మా. ప్రైవేటుగా చదవడానికి అవకాశా లున్నాయేమో చూస్తాను. ఈ వూళ్లో కాలేజీ లేదుకదా. ఇంకోచోటికి పంపించి చదువు చెప్పించాలంటే బోలెడు డబ్బు కావాలి. నీకు తెలియందేముంది? అయినా ఇప్పుడే తనకి చదువుకి, ఉద్యోగానికి తొందరేమిటమ్మా, కొద్ది రోజులు పోనీ. అన్నీ ఆలోచిద్దాం ఈలోగా కాలక్షేపానికి కావలిస్తే నేను రోజూ స్కూలు లైబ్రరీ నుండి పుస్తకాలు తెచ్చిస్తాను. చదువుకోవచ్చు.

నువ్వు రాధకోసమైనా లేచి తిరగడానికి ప్రయత్నించాలి ఇలా మనోవ్యాధితో కృశించిపోతుంటే మందులేమీ పని చేయడంలేదు. జరిగినదానికి మనం ఎంత బాధపడినా, పోయిన మనిషి రాడుకదా. మన శక్తివంచన లేకుండా, రాధ సుఖపడాలనే అతను కోరిన కోర్కెలన్నీ తీర్చాం దైవనిర్ణయం యిలా ఉంది. ఎవరం ఏం చేయగలం" అన్నాడు ప్రకాశం.

"నా కోసం బెంగపెట్టుకుని నువ్వు నాకు దూరం అయిపోతావా? నాకే బాధా లేదు. హాయిగానే ఉన్నాను. నువ్వుకూడా అన్నీ మరిచిపోయి మామూలు మనిషివి కావాలి" అంటూ తల్లి ప్రక్కలో పడుకుని ఆవిడకి ధైర్యం చెప్పింది రాధ.

ఎంతమంది ఆవిడ కావాలని ప్రాకులాడితే నేం, ఎన్ని మందులు వాడితేనేం. ఆవిడ కూతురు బెంగతోనే ఈ లోకం విడిచి వెళ్లిపోయింది.

అసలు శాంతమ్మగారి పోలం అమ్మేసిన దగ్గరనుంచీ కామాక్షికి పిల్లమీద కోపం మరీ ఎక్కువయింది. ఉన్నదంతా ఆడబిడ్డకి పెట్టేస్తోంద నొకటి, అత్తగారు ఉన్నన్నాళ్లు ఆవిడ ఖర్చులన్నీ తమ మెడకే చుట్టుకుంటాయనొకటీను.

ఆవిడ మంచం ఎక్కిన తరువాత మందు ఖర్చులు కూడ వచ్చిపడ్డాయి. దిక్కులేని ఆడబిడ్డ ఒకత్తె నెత్తినెక్కి కూర్చుంది అందుకే అయినప్పుడూ కానప్పుడూ నోరు చేసుకుంటూ మాటిపోటీ మాటలంటూండేది. అసలు ఆ శూలాలలాంటి మాటలకే శాంతమ్మగారి హృదయం తూట్లుపడిపోయి ఉంటుంది

చాటుగా ప్రకాశం భార్యని ఒక్కోసారి మందలించేవాడు దాంతో ఆవిడ మరీ



రెచ్చిపోయేది. ఇంక చేసేది లేక అతను తల్లికీ చెల్లెలికి వచ్చచెప్పడానికి ప్రయత్నించేవాడు. తల్లి మంచంమీద కూర్చుని "కామాక్షి మాటలు నువ్వేం మనస్సులో పెట్టుకోకమ్మా. తన సంగతి నీకు తెలిసిందే కదా. ఏమైనా అంటే మరీ నోరు పారేసుకుంటుంది. కాని తన మాటలవల్ల నేను నీకు, రాధకి లోపం చేస్తానని ఎప్పుడూ అనుకోవద్దు. నేను నా కర్తవ్యాన్ని ఎన్నడూ విస్మరించను" అనేవాడు.

"వదినన్న దాంట్లో మాత్రం తప్పేముందన్నయ్యా. నీకు రావలసింది కూడా దక్కకుండా చేశాను. పోనీ అంటే నేను సుఖపడిందీ ఏమీలేదు. చివరికి నేను కూడ నీ మెడకే చుట్టుకున్నాను" అంది రాధ వోసారి.

"అమాటే అనవద్దంటున్నాను. అమ్మకి వేరే అన్నంటూ ఇచ్చారు కనక అనుకుంటున్నాం. లేకపోతే ఆవిడకి తిండి బట్ట పెట్టాల్సిన బాధ్యత వాడి కాదా. నువ్వు యివాళ భారంకాదు. నాతోపాటే కలో గంజో తాగి ఉందువుగాని. మీ అత్తవారు ఏమైనా ఇస్తారేమో నెమ్మదిగా మధ్యవర్తుల ద్వారా ప్రయత్నిద్దాం. అసలు అవన్నీ మీరేమీ ఆలోచించవద్దు. మీ వదిన మాటల్ని లెక్కచేయకోవద్దు అంతే. ఈ ఇల్లు నాన్నగారు కట్టించినది. మనం తింటున్నదంతా నాన్నగారిచ్చినది. అదొక్కటే మీరు మనస్సులో పెట్టుకోండి.' అన్నాడు ప్రకాశం.

కాంతమ్మగారు పోయిన తరువాత రాధ మరీ లోకువై పోయింది వదినగారికి. ఎవరి అడ్డూ లేకపోవడంతో భర్త మాటలు అసలే లక్ష్యపెట్టడం మానేసింది. రాధకి భరించలేని దుఃఖం వచ్చేసింది. చాటుగా ఎంతో ఏడ్చేది. అన్నగారికి ఏమని చెప్తుంది. ఏ పది రోజులకో పార్వతి దగ్గర నుండి వచ్చే ఉత్తరాలే, కాస్త వోదార్పు కలిగించేవి.

చివరికి ఒకరోజు అన్నగారితో తన మనస్సులో ఉన్నమాట చెప్పేసింది. "ఈ రోజులలో ఎవరి సంసారం వాళ్లకే గడవడం కష్టం అన్నయ్యా. అమ్మంటే

చిన్నా కన్నతల్లికీ ఆవిడికి చూడాల్సిన బాధ్యత నీది. కొడుకుగా నీ కర్తవ్యం నువ్వు నెరవేర్చుకున్నావనే నేనంటాను. మా ఉనికి వల్ల ఇంట్లో నీకెంత అశాంతి కలుగుతున్నా, ఒక్కనాడైనా మమ్మల్ని ఒక్క మాటైనా అనకుండా ఆదరించావు. అమ్మ వెళ్లిపోయింది. ఇంక నిజం ఆలోచిస్తే నా బాధ్యత నీకేముందన్నయ్యా. అందరిలాగే నన్నూ ఒక అయ్య చేతిలో పెట్టావు. నా దురదృష్టం కొద్దీ యిలా జరిగింది. వాళ్లూ ఏదో అందరిలాంటి వాళ్లయితే నే నక్కడికే వెళ్లిపోదును. కాని వాళ్ల సంగతి తెలుసుగా. నేనా నరకంలోకి వెళ్లదలచుకోలేదు ఇక్కడే నీకు భారం కాకుండా, నా సంపాదనమీదే బ్రతుకుదా మనుకుంటున్నాను. నువ్వేమీ అనుకోకపోతే వంట కూడా వేరే నే వండుకుంటా. నా కేదైనా ఉద్యోగం మాత్రం చూపించు. ఈ వూళ్లోనే అయితే నువ్వు కూడ కొంచెం సాయంగా ఉంటావు. ప్రయత్నం మాత్రం చేసిపెట్టు."

ఇంక నిగ్రహించుకోలేక, "రాధా" అంటూ చెల్లెల్ని హృదయానికి హత్తుకుని ఆమె తల తన అశ్రువులతో తడిపేశాడు ప్రకాశం. కొంతసేపటికి తెప్పరిల్లి "అలాగే ప్రయత్నిస్తానమ్మా. నీ సంపాదన నిడిగా దాచుకుందువుగాని. గుప్పెడు మెతుకులు మాత్రం నా ఇంట్లోనే తినాలి తల్లీ."

"అసలు ఇప్పుట్లో వదినకి నీ సహాయం ఎంతో అవసరం. అయినా ఇంత నిర్మోహమాటంగా ఎలా ఉండగలుగుతుందో నా కాశ్చర్యం వేస్తోంది." అన్నాడు.

"అయితే వదిన పురిటికి వెళ్లదా అన్నయ్యా."

"వెళ్లినా సుఖపడిపోదుము వో రెండు మూడు నెలలు ఏ ఉద్దేశ్యం ఉందో వెళ్లనంది పోనీ వాళ్లమ్మగారైనా వస్తారంటే ఆవిడికీ వంట్లో బాగుండలేదుట. ఆ చాకిరీ నీకు తప్పదమ్మా" అన్నాడు లేని నవ్వు తెచ్చుకుంటూ.

"ఛ. చాకిరీ ఏమిటన్నయ్యా ఆమాత్రం చెయ్యలేనా ఏమిటి ? వదిన అందని నేనేం బాధపడడంలేదు. వూరికనే కూర్చుంటే ఏంతోస్తుంది. ఎన్నాళ్లని కూర్చోగలం

అందుకని ఏదో కాలక్షేపంగా ఉంటుం దని ఉద్యోగం సంగతి ఎత్తాను. నువ్వు మరేం అనుకోకు. ఆ ప్రయత్నం మాత్రం చేసిపెట్టు.'' అని గదిలో నుండి వచ్చేస్తూంటే,

"ఇదుగో రాధా, ఈ నూరు రూపాయలు నీదగ్గ రుంచుకో. ఏదైనా ఖర్చుకుంటాయి. అమ్మ పొలం అమ్మిన బాపతుది. మిగతా అంతా ఖర్చయిపోయింది.'' అన్నాడు డ్రాయరులోంచి డబ్బు తీస్తూ.

"నా కెందు కన్నయ్యా. భలేవాడివే. నా కసలు ఖర్చేముంటుంది ?'' అంది రాధ నవ్వేస్తూ.

"ఖర్చు లేకపోతే దాచుకో.'' అంటూ బలవంతంగా చెల్లెలి చేతిలో పెట్టాడు రూపాయి నోట్ల కట్ట ఒకటి.

తరువాత నెల్లాళ్లకే కామాక్షికి కూతురు పుట్టింది. కామాక్షి పురిటిలో ఉండగా ఓరోజు ప్రకాశం స్కూలునుండి వస్తూనే...

"రాధా, మనింట్లో ఆ రెండు గదులు ఎవరికైనా అద్దెకిస్తే ఎలా ఉంటుం దంటావు.'' అన్నాడు.

"అమ్మ పడుకుంటూండే గది, ఆ ప్రక్క దీనా ? ఇవ్వొచ్చు. వాటిల్లో సామాను కూడ ఎక్కువేం లేదు.''

"అంటే నీకు కొంచెం ఇబ్బంది అవుతుందేమో. నువ్వీ హాలు వాడుకోవచ్చు ననుకో. అందుకే నిన్నడిగి మాటివ్వవచ్చు నని వూరుకున్నాను'' అంటూ నసిగాడు.

"నన్నడిగే దేమిటన్నయ్యా. నీకూ, వదినకూ ఇష్టమైతే వెంటనే మాటిచ్చేసేయి. ఇంతకీ ఎవరు కావాలంటున్నారు ?''

"మా స్కూల్లోకి క్రొత్తగా వచ్చారులే ఒక మేష్టారు. సూర్యారావుగారని. అతనూ తల్లీ ఇద్దరే ఉంటారు. అతని కింకా పెళ్లి కాలేదు. అప్పుడు కావలిస్తే ఇంకో పెద్ద యిల్లు తీసుకుంటాడేమో. ప్రస్తుతం ఓ గది వంటిల్లయినా సరే ఎక్కడైనా ఓ ఇరవై రూపాయలకిస్తే మనకీ కాస్త డబ్బు యిబ్బంది తగ్గుతుంది. అతనికీ పెద్ద కష్టం ఉండదు. అయినా మీ అందరి ఉద్దేశ్యం కనుక్కొని చెప్తాచ్చులే అని వూరుకున్నాను.''

"వదినకక్కడే చెప్పన్నయ్యా. ఇష్టే బాగానే ఉంటుంది. ఇబ్బందేమిటి? ఎంత ఇల్లున్నా వాడుకుంటూనే ఉంటాం.''

కామాక్షి కూడ అంగీకరించడంతో తల్లీ కొడుకులు ఆ సాయంత్రమే వచ్చి ఇల్లు చూసుకుని మర్నాడే అందులో ప్రవేశించారు.

ఆవిడిని చూస్తుంటే రాధకి తల్లి జ్ఞాపకం రాసాగింది. అందుకే ఆవిడిని పిన్నిగారు పిన్నిగారు అని పిలుస్తూ చనువుగా ఉంటుంది.

వాళ్లు వచ్చిన ఓ పదిహేను రోజులకే కామాక్షి తల్లికి సీరియస్‌గా ఉందని టెల్గ్రాం వచ్చింది. అది చూస్తూనే ఆవిడ, పిల్లలు ప్రకాశం ప్రయాణం అయారు.

"నేను త్వరగానే వచ్చేస్తానమ్మా. నువ్వేం భయపడకు. ప్రక్కవాళ్లు కాస్త సాయముగా ఉన్నారుగా.'' అంటూ రాధకి ధైర్యంచెప్పి,

"పిన్నిగారు మా రాధని మీరు కాస్త చూస్తుండాలి. ఒక్కతే ఎప్పుడూ ఉండలేదు. ప్రక్కని మీరున్నారనే ధైర్యంతోటే నేనీ ప్రయాణం పెట్టుకున్నాను. నే నెంత రెండు రోజులలో వచ్చేస్తానండి.'' అంటూ పిన్నిగారికి చెల్లెలి బాధ్యతంతా అప్పగిస్తూంటే, కామాక్షి రుసరుస లాడుతూ,

"ఊఁ మరీ చోద్యం. చంటిపిల్లా ఏమిటి ? దడుసుకోడానికి, బెంగపెట్టుకోడానికీను. మీరు త్వరగా తెమలండి. మళ్లీ రైలు అందదు.'' అంటూ ఓ కేక వేసింది.

వీళ్లు వెళ్లిన మర్నాడే ఆవిడ పోయింది. ఆ పది రోజులు తనక్కడ ఉండక తప్పదని ఉత్తరం వ్రాశాడు ప్రకాశం.

ప్రకాశం వచ్చేదాకా సూర్యం మేష్టారి తల్లి రాధని ఎన్నోవిధాల కనిపెట్టేఉండి తన కన్న బిడ్డలాగే ఆదరించింది. మేష్టారితో రాధకి పరిచయం ఎక్కువలేదు కాని, ఒకే యింట్లో ఉండడంచేత మధ్య మధ్య ఒకరినొకరు చూసుకోవడం తటస్థిస్తుంటుంది. అతను కూడా చాలా మంచివాడు. (సశేషం)

**మేషం :** ఏ వ్యవహారంలోనూ విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు. కొన్ని వ్యవహారాలు సులువుగా నెరవేరినా, మరికొన్నింటిలో చాలా శ్రమపడవలసి వస్తుంది. వారం ప్రారంభంలో సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మీరు స్వంతంగా చేసే వ్యాపారాల కంటే, భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. రావలసిన డబ్బు మీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. సాంఘిక కార్యక్రమాల్లో ప్రముఖ పాత్రను నిర్వహించగలరు. ఉష్ణ సంబంధమైన అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు కొంచెం శ్రమ మీద నెరవేరతాయి. ఉద్యోగురాండ్రకు యోగవంతమైన సమయం.

**వృషభం :** వృత్తి వ్యాపారాల్లో ఆదాయంపెరిగినా దాని నిమిత్తం మీరు పొందిన శ్రమతో పోల్చినప్పుడు యీ వారం సంతృప్తికరంగా ఉండదు. వ్యాపారంలో మీకు ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో ప్రయోజనకరమైన సంభాషణలను జరపగలరు. వృత్తి రీత్యా చేసే ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు చాలావరకు తొలగిపోతాయి. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం యిదివరకటి కంటే బాగా ఉంటుంది. ప్రయాణాలో చనలు చేస్తారు. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మిథునం :** వృత్తి వ్యాపారాల్లో మీకార్యక్రమాలు చురుకుగా సాగడం వలన ఆదాయం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా కొంత వరకు లాభిస్తాయి. వ్యాపారంలో మీ యెదుట పొగడుతూ, చాటున దూషించే వ్యక్తులతో వ్యవహరించవలసి వస్తుంది. వృత్తిలో కొంతమంది మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవలసిన అవసరం యేర్పడుతుంది. ఆర్థిక వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు రాగల సూచనలు ఉన్నాయి, ఉద్యోగంలో కార్యభారం పెరిగినా, మీ కృషిని అధికారులు గుర్తించగలరు. ఆరోగ్యం బాగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. బంధుమిత్రులను కల్పుకొంటారు. విలాస వస్తువులు కొంటారు.

**కర్కాటకం :** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో ఆందోళన కలిగించే పరిస్థితులు యేర్పడతాయి. యితరులతో కలసి చేసే వ్యవహారాల్లో, ఆ యితరులు మధ్యలో తప్పుకోవడం వలన మీరు యిబ్బందికి గురి కావలసి వస్తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. ఉద్యోగంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభించడం వలన మీ శక్తిసామర్థ్యాలను రుజువు చేసికొనగలరు రాజకీయ వ్యవహారాల్లో [illegible] ప్రోత్సాహకరంగా ఉంటాయి. [illegible] వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది.

# వారఫలం

**15-4-1966 శుక్రవారం మొదలు 21-4-1966 గురువారం వరకు.**

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభ కార్యాల విషయంలో అనుకూలమైన వార్తలను వింటారు.

**సింహం :** వ్యాపారంలో యిదివరకు యేవో కారణాల వలన ఆగిపోయిన వ్యవహారాలను వారం ప్రారంభంలో పూర్తి చేయగలరు. వృత్తిలో మీరు యిదివరకు కొన్ని వ్యవహారాలను నిర్లక్ష్యం చేయడం వలన ఇప్పుడు పొందవలసిన ప్రయోజనాన్ని పొందలేకపోవచ్చును. వ్యాపారం భారీ యెత్తున చేయడం వలన ఆర్థికంగా ఒత్తిడి వచ్చినా యేదో ఒకవిధంగా అన్ని వ్యవహారాలను సరిపుచ్చుకొనగలరు. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో యితరుల జోక్యం వలన నష్టం వస్తుంది. సాంఘిక కార్యక్రమాలకు అనుకోని మార్పులు వస్తాయి. ఆరోగ్యం బాగా ఉండదు.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య :** వృత్తి వ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో నష్టం రాగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. వృత్తిలో యితరుల కోసం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి గాని, మీ స్వంత పనులలో చాలా ప్రతిఘటనను యెదుర్కోవలసి వస్తుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు వాయిదా వేయడం మంచిది. ఉద్యోగంలో గౌరవం మాత్రం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో స్వల్పభేదాభిప్రాయాలు వచ్చి సర్దుకొంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు పుణ్యకార్యాలు చేస్తారు.

**తుల :** వృత్తి వ్యాపారాల్లో సాటివారితో పోటీ పెరగడం వలన తరచుగా మీ కార్యక్రమాలను మార్చుకోవలసి వస్తుంది. వృత్తిలో కొన్ని అవకాశాలు ఆకర్షణీయంగా కన్పిస్తాయిగాని, వాటి వలన ప్రయోజనం కంటే ప్రయాస అధికంగాఉంటుంది. వ్యాపారంలో ప్రయోజనకరమైన సంభాషణలను జరపగలరు. రావలసిన డబ్బు సమయానికి అందకపోవడం వలన యిబ్బందికి గురి కావలసి వస్తుంది. ఉద్యోగంలో యితరులు చేసిన పొరబాట్లకు కూడా మీరే బాధ్యత వహించవలసిన పరిస్థితి యేర్పడుతుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగల సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం :** వృత్తి వ్యాపారాల్లో కొంచెం శ్రమ కలిగినా తగిన ప్రతిఫలం లభించగలదు. కొన్ని వ్యవహారాల్లో మీరు యేమి చేసినా తప్పు పట్టే ఉద్దేశంతో కొంతమంది వ్యక్తులు వ్యవహరించడం వలన మీ మంచితన మేమీ రాణించకపోవచ్చును. మీరు స్వంతంగా చేసే వ్యాపారాల కంటే, భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో సామాన్యమైన వ్యవహారాలకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. కుటుంబ కార్యక్రమాలు శ్రమ మీద నెరవేరతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. అధికవ్యయం జరుగుతుంది.

**ధనుస్సు :** మీ స్వంత వ్యవహారాలు బాగానే ఉంటాయి కాని కొంతమంది మిత్రులకు చికాకులు కలగడం వలన మీరు కూడా యిబ్బందికి గురి కావలసి వస్తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాల్లో ఆఖరి క్షణంలో కొత్త సమస్యలు తలయెత్త గల సూచనలు ఉన్నాయి. వారం ప్రారంభంలో సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో అనుకూలమైన వార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాల్లో విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు. ఉద్యోగంలో అకారణంగా కొన్ని అపోహలకు గురి కాగల ప్రమాదం ఉంది. ఆరోగ్యం బాగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. సంతానానికి అనారోగ్యం చేయవచ్చును.

**మకరం :** ఈవారం మీరు చేసే ప్రయత్నాల వలన వెంటనే విశేషమైన ప్రయోజనం యేమీ ఉండకపోవచ్చునుగాని, వాటి ఫలితాన్ని ముమ్ముందు మీరు తప్పకుండా పొందగలరు. వృత్తిలో మీరు యెదుటివారి మంచిని కూడా కోరడం వలన మీరే యిబ్బందికి గురి కాగల సూచనలుకున్నాయి. వ్యాపారంలో గౌరవం బాగా ఉంటుంది. ఆదాయంతో నిమిత్తం లేకుండ సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి రాగలదు ఉద్యోగంలో మీ పరిస్థితి బాగా ఉంటుంది స్థిరాస్థి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. కుటుంబ సంతోషం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు రాణించగలవు. పుణ్యకార్యాలు చేస్తారు.

**కుంభం :** ఈ వారం మీరు ఘనవిజయాలను యేమీ సాధించలేకపోయినా, కొన్ని వ్యవహారాల్లో యిదివరకు యేర్పడినఅనిశ్చిత పరిస్థితి తొలగిపోవడం వలన మానసికంగా విశ్రాంతి లభిస్తుంది. భారీ యెత్తున చేసే వ్యాపారాల్లో కొంతమంది మిత్రుల సహకారం లభిస్తుంది. వృత్తి రీత్యాచేసే ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వ్యాపారంలో మీ ఆలోచనలు మీకే కాకుండా మీ మిత్రులకు కూడా లాభదాయకంగా ఉంటాయి. ఉద్యోగంలో మార్పుల కోసం ప్రయత్నం చేయడానికి దిం

వెచ్చయింకాదు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు శ్రమ మీద నెరవేరతాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మీనం** : వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులకు గురి కావడం వలన తరువాత బాగా ఉన్నప్పటికీ ఈ వారం సంతృప్తికరంగా ఉండదు. వ్యాపారంలో చాలా శ్రమ మీద స్వల్పాభివృద్ధిని సాధిస్తారు. వృత్తిలో మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో మోపునకు రాని కార్యభారాన్ని వహించవలసి వస్తుంది. కొన్ని వ్యవహారాల్లో అధికవ్యయం జరగడం వలన ఆర్థికంగా ఒత్తిడిరాగలదు. వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వజ్రపు ఉంగరాలు లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. అలంకార వస్తువులు కొంటారు.

—మహేష్ ●









# చిత్రకారుడి దృష్టిలో మద్రాసు



మదరాసు వీధి దృశ్యం ...!

పదిహేడవ శతాబ్దం చివర, మద్రాసుకి మంచి దశ పట్టినదనతగినప్పుడు ఈస్ట్ ఇండియా కంపెనీ నౌకలు ప్రతి సంవత్సరం (మే, జూన్, జూలై నెలలలో) ఇక్కడికి వచ్చేవి దక్షిణం వైపునుంచి వస్తున్న వీటికి మంచి గాలి తోడ్పడేది.. ఆ రోజుల్లో మద్రాసుని సమీపించే సముద్ర ప్రయాణీకులకి కనిపించిన దృశ్యం ఈనాడు ఒక స్టీమర్ 'డెక్' మీదనుంచి ప్రయాణీకులకి కనిపించే దృశ్యమే అయిఉండాలి " హెన్రీ డేవిడ్సన్ లవ్ "వెస్టిజస్ ఆఫ్ ఓల్డ్ మెద్రాస్" 1వ సంపుటం, (1913)

ఇరవయ్యవ శతాబ్దం ప్రారంభంలో ఇంజనీర్‌గా ఈ ప్రాంతంలో పని చేసిన లవ్ రాసిన మాటల్లో ఎంత నిజమున్నా 1966 లో మద్రాసుకి వచ్చే ప్రయాణీకుడు మాత్రం అప్పటికే చాలా భేదం చూడగలుగుతాడు! ఫోర్ట్ సెయింట్ జార్జి దగ్గర సముద్రం వెనక్కి పోవడమేకాదు, కేవలం 'పెద్ద ఊరు' అనతగిన ఒక పట్నం కాస్తా ఆధునిక పారిశ్రామిక కేంద్రంగా, 'మెట్రోపోలిస్' గా మారి పోతోంది పోర్బరు విస్తరణ, ఎప్పటికప్పుడు పైకి లేస్తున్న కాంక్రీట్ కట్టడాలు దీనికి కళ్లకి కట్టే నిదర్శనాలు. దక్షిణ భారత దేశానికి మద్రాసు అన్ని విధాలా కేంద్రం . . .

అసలు మద్రాసుకి ఆ పేరు ఎలా వచ్చింది? 'మాదరసెన్' అనే క్రైస్తవ జాలరి నాయకుడిని బట్టేవచ్చిందని 1820లో బి. రామస్వామినాయుడు రాశాడు యూల్, బర్నెల్ అనేవారు 'మద్రాసా' అనే హిందుస్తానీ మాటనుంచి వచ్చిందన్నారు —పాత ఫోర్ట్ సెయింట్‌జార్జి ప్రాంతంలో ఒక పాఠశాల (మద్రాసా) ఉండేదని కాని, పై రెండు సరయినవికావని లవ్ అభిప్రాయం. ఇంకా ఎన్నో సిద్ధాంతాలున్నా 'మదరాజా' అనే నాయకు డెవరో ఉండి ఉంటాడనీ, అతని పేరే 'మద్రాసు'కి వచ్చి ఉంటుందనీ లవ్ ఊహ.

ఫోర్ట్ సెయింట్‌జార్జికి ఉత్తరానఉండేగ్రామమే అసలు మద్రాసు కోట కట్టకముందు ఇంగ్లీషు వారికి మచిలీపట్నంలో ఒక 'ఫాక్టరీ' (నిజానికి ఒట్టి గొడవున్ మాత్రమే) ఉండేది. డచ్‌వాళ్ళు మాత్రం పులికాట్‌లో స్థిరపడటంతో వారి వ్యాపారం బాగా సాగేది. ఈ ప్రాంతంలో తమకీస్థానం దొరికితే మంచిదని ఈస్ట్ ఇండియా కంపెనీవారు తమ ప్రతినిధి మిస్టర్ ఫ్రాంసిస్ డేని చంద్రగిరి రాజా నాయకులలో ఒకరివద్దకి పంపించి 'కూవమ్' నది తీరాన ఉన్న స్థలాన్ని గుత్తకి తీసుకున్నారు ఇదే చెన్నపట్నం అని లవ్ అభిప్రాయం. (విన్సెంట్ స్మిత్ మాత్రం మద్రాసు స్థాపించింది ఇక్కడే అని రాసేశాడు!)

ఈ పరిసరాలలో ఎన్నో చిన్న చిన్న ఊర్లు ఉండేవి. వాటిలో తిరువలిక్కేణి, పోర్చుగీసువారి శాన్‌తోమ్ (సాన్‌థోమె) ముఖ్యమయినవి.

తిరువలిక్కేణిలోని పార్థసారథి గుడి గురించి పాత కాలంనాటి రికార్డులలో ఉంది. చెన్నకేశవ పెరుమాళ్ గుడితోబాటు ఇది ఈ ప్రాంతంలో మంచి పేరు పొందిన దేవాలయం. ఇక శాస్‌తోమ్ పక్కనేఉన్న మైలాపూర్ ఈనాటిదికాదు. టోలెమీ (క్రీ. శ. 2 వ శతాబ్దం ఈజిప్టు శాస్త్రజ్ఞుడు చెప్పిన 'మల్లి—అర్ఫా' మైలాపూరేనని కొందరంటారు. తిరుక్కురల్ రచయిత ఇక్కడి వాడేనని కథలున్నాయి! అసలు శాన్‌తోమ్‌నే "సావ్‌థోమె ద మెలియాపోర్" అని పోర్చుగీసువారు మొదట్లో పిలిచేవారుట. సెయింట్ థామస్ (ఏసుక్రీస్తు శిష్యులలో ఒకడు)ని ఇక్కడే భూస్థాపితం చేశారనీ, ఒక కథ ఉంది. ఈయన సెయింట్ థామస్ కొండ దగ్గిర, ప్రమాదవశాత్తు, ఒక వేటగాడి బాణానికి గురిఅయి చనిపోయాడనే కథ కట్టుకథ అని లవ్ అభిప్రాయం—మరణ సమయంలో థామస్‌చుట్టూ నెమళ్లు తిరుగుతున్నాయనే వివరం మైలాపూర్ పేరునిబట్టే సృష్టించినదని ఆయన అంటాడు!

సుప్రసిద్ధ ఇటాలియన్ 'ప్రయాణీకుడు' (లోక సంచారి!) మార్కోపోలో కూడా ఈ కథ గురించి రాశాడు

మైలాపూర్‌లోనేఉన్న లజ్ చర్చి వెనక పెద్ద గాథ ఒకటి ఉంది సముద్రంమీద తుపానులో కొట్టుకుపోతున్న నావికులకి ఒక వెలుగు కనిపించగా దాని ఆధారంగా సురక్షితంగా వడ్డు చేరుకున్నారుట. కాని అది కనిపించిన స్థలం చేరగానే వెలుగు అదృశ్యం అయిందిట! తమ కృతజ్ఞతని తెలుపుకొనటానికి ఆ స్థలంలో ఒక చర్చి నిర్మించారుట నిర్మాణం 1516 లో జరిగిందని అక్కడి శాసనం ఒకటి చెప్తుంది. కాని ఇది నిజంకాదని ఒక చరిత్రకారుడి అభిప్రాయం.

".....ఈ దక్షిణాది నగరం (మద్రాసు) హిందూస్తాన్‌లోని బ్రిటిష్ స్థలాలలోకెల్లా ముఖ్యమయినది. యూరోపియన్, దేశీయ వస్తువులకి ముఖ్య వ్యాపార కేంద్రం......" అని లవ్ అనే అన్నాడు. ఫోర్ట్ సెయింట్ జార్జి ఒకటే అప్పటికాలంలో భారతదేశంలో ఉన్న మూడు బ్రిటిష్ స్థావరాలలో కోట కలది ఈ కోటనుంచి బ్రిటిష్‌వారూ క్రమంగా తమ బలాన్ని పెంపొందించుకున్నారు. 1763 లో నేటి చెంగల్పట్ జిల్లాని శాశ్వతంగా పుచ్చేసుకున్నారు. కర్ణాటకనవాబువద్దనుంచి 1801లో లార్డ్ వెల్లస్లీ, నవాబు రాజ్యాన్నే లాక్కున్నాడు మద్రాసు ప్రెసిడెన్సీలోని ముఖ్య ప్రాంతాలన్నీ మైసూరు యుద్ధాలతో ఇంగ్లీషువారి వశం అయిపోయాయి

మద్రాసు పరిపాలనతో సంబంధమున్న కొందరు సుప్రసిద్ధ విదేశీయులు రాబర్ట్ క్లయివ్, ఎలిహూ యేల్ (అమెరికాలోని యేల్ విశ్వ విద్యాలయం ఈయన పేరనే ఉంది), వారెన్‌హేస్టింగ్స్, నెపోలియన్‌ని ఓడించిన డ్యూక్ ఆఫ్ వెల్లింగ్‌టన్, 'సతీ సహగమనం' రద్దు చేసిన లార్డ్ విలియంబెంటిక్....!



'ఆకాశాన్ని అంటే' ఎల్. అయ్. సి. భవనం.



బొమ్మలు : మనోహన్ దత్

# కాలంతోపాటు మార్పుచెందుతున్న మదరాసు...!

ఇరవయి సంవత్సరాలక్రితం కూడా మద్రాసు పెద్ద నగరమేకాని ఆధునిక పారిశ్రామిక కేంద్రాలలో కనిపించే 'హడావుడీ', రద్దీ ఇక్కడ కనిపించేవికావు. చక్కటి సముద్రతీరం, దూరానికి అందంగా కనిపించినా దుర్గంధం వెదజల్లే కాలవలూ, పెద్ద పెద్ద తోటలు కల భవనాలూ— తిరువళ్ళిక్కేణి, జార్జిటవున్ల సంగతి వేరు— చిన్న నీలం, ఆకుపచ్చరంగు బస్సులూ, పెద్ద శబ్దంతో నెమ్మదిగా కదిలివెళ్ళే ట్రామ్ బళ్ళూ, రిక్షాలూ, జట్కాలూ, ఎద్దు బళ్ళూ ఇవి మద్రాసు లక్షణాలు అనిపించేట్లు చేసేవి. ఉత్తరం వైపున హైకోర్టు మీద దీపస్తంభం, 'అయిరన్ బ్రిడ్జి', వద్ద యుద్ధ స్మారకచిహ్నం, ప్రెసిడెన్సీ కాలేజి, మూర్‌మార్కెట్, జంతు - ప్రదర్శనశాల, మెరీనా ఫవుంటెన్, శన్‌తోమ్‌చర్చి, మ్యూజియం ఇవి ఇక్కడి విశేషాలు. మైలాపూర్ పక్కనే అడవి ప్రదేశంలాగ ఉండేది. నేడు గాంధినగరండున్న వైపుకి వెళ్ళటానికి ఎందరో అడయార్ 'నది'ని పడవమీద దాటేవారు! అటువైపు మరిచెట్టూ 'థియొసాఫికల్ సొసయిటీ' మాత్రమే ఆకర్షణలుగా ఉండేవి. ఎల్‌ఐసీ చర్చి చుట్టూ వెతికినా ఒక పెద్ద హోటల్ కనిపించేదికాదు. సినిమాహాళ్లన్నీ మవుంట్‌రోడ్‌వైపో, 'టవున్'వైపో ఉండేవి.....

నేటి సంగతేవేరు. మవుంట్‌రోడ్‌మీదనే భారతదేశంలోకెల్లా ఎక్కువ అంతస్తులుకల కట్టడం ఒకటి వెలిసింది. ఉత్తరం దిక్కు ఇక పెరగలేక పూరు పడమరగా ఎదిగి, అదీ చాలక ఇప్పుడు దక్షిణం వైపు విస్తృతమవుతోంది. ఎటుచూసినా 'హవుసింగ్‌బోర్డ్' కాలనీలు కనిపిస్తున్నాయి. ట్రామ్‌లు ఆగిపోయి, చిన్న నీలం బస్సుల స్థానంలో పెద్ద ఎర్ర బస్సులు వచ్చేశాయి! టాక్సీలసంఖ్య ఎంత అధికం అయినా ఇంకా చాలటంలేదు. ఒకకొత్త పరిణామం సైకిల్ రిక్షాల ప్రత్యక్షం.

మద్రాసుని 'బర్మింగ్‌హామ్ ఆఫ్ ఇండియా' అన్నారుట ఎవరో. రెండు మోటారు ఫ్యాక్టరీలు, ఇంకా ఇతర వాహన సౌకర్యాల ఉత్పత్తి కేంద్రాలు, ఈ వర్ణన సరయినదే అనిపించేట్లు చేస్తాయి. త్వరలో ఇక్కడ సూనె కర్మాగారం ఒకటికూడా వస్తుంది. తిరువత్తియూర్ పరిసరాలలో ఫాక్టరీలైట్లు రాత్రిపూట చాలా విచిత్రంగా కనిపిస్తాయి....

అన్నిటికన్నా 'ముఖ్యమయిన' అభివృద్ధి సినిమా పరిశ్రమ అభివృద్ధి! పారిశ్రామిక జీవనంవల్లా, దానివల్ల ఏర్పడ్డ ఆదాయాభివృద్ధివల్లా, 'డి. ఎం. కె, డి. కె.' పార్టీల ప్రభావంవల్లా సినిమాహాళ్లు ఇక్కడి ఆధునిక జీవితంలో ప్రత్యేకమయిన స్థానాన్ని సంపాదించుకున్నాయి.....కాని, శాస్త్రీయ సంగీత కచ్చేరీల సంఖ్యా తగ్గలేదు, పురాణ కథా కాలక్షేపాల సంఖ్యా తగ్గలేదు. రోడ్లు మాత్రం రోజురోజుకీ చెడిపోతున్నాయి...

మద్రాసు కనీసం రెండు భాషలవారికి కేంద్ర నగరం. తెలుగు 'రాజుల', నవాబుల, తెల్లదొరల పరిపాలనలవల్ల ఎన్నో రకాల సంస్కృతి పరిణామాలకి నిలయం. నేటి కాంగ్రెస్ ప్రభుత్వం ఆర్థిక, సామాజిక విధానాలు కొన్ని శతాబ్దాలుగా ఏర్పడిన సంస్థలనీ, గుణాలనీ తేలికగామార్చి వెయ్యగలవు. కాని ఇక్కడే పుట్టి పెరిగిన వారికిమాత్రం మద్రాసు, మద్రాసుగానే ఉండిపోతుంది. ●

-చెన్నయ్య



హైకోర్టు మీద లైట్‌హౌస్

# ప్రేమంటే ఏముంది?

## వసుంధర



"ఏమండీ !"

రాజారావు చదువుతూన్న నవల పక్కన పడేశాడు. అదే వసుంధరలోని విశేషం ! ఆమె ఏమండీ అనడంలో ఎంతో మాధుర్యం ఉంటుంది. ఆ పిలుపు వింటే రాజారావు మరింకేపనీ చేయలేడు.

ఏదో విశేషముంటే తప్ప వసుంధర అలా మధురంగా ఏమండీ అని పిలవదు. ఆ సంగతి రాజారావుకు బాగా తెలుసును. అందుకే నవల అవల పడేసి—"ఏం?" అన్నాడు.

వసుధర నవ్వి ముఖం పక్కకు తిప్పి నెమ్మదిగా అంది—"మీకో మంచి విషయం చెప్పనా ?"

"చెప్పు !"

"చెబితే మీరు నన్నేం చేస్తారో నని భయంగా ఉంది."

"ఏమీ చెయ్యను—చెప్పు !"

"అబ్బ—సిగ్గేస్తోందండీ—" మళ్లీ ఆ మాటల్లో ఏదో అందం—రాజారావుని కవ్వించింది. చటుక్కున లేచి వెళ్లి ఆమె పక్కన కూర్చుని—"ఎందుకలా వూరిస్తావు వసూ ! చెప్పవూ ?" అన్నాడు.

"మీ నాన్నగారు .." అని మళ్లీ ఆగిపోయింది వసుంధర. రాజారావుకు ఉత్కంఠ హెచ్చింది. "మా నాన్నగారి కేముంది—" అన్నాడు తికమకపడుతూ.

"పోనీ మీ అమ్మగారు ...." అంది వసుంధర మళ్లీ. ఈసారి రాజారావుకి చిరాకు వచ్చింది. "మంచి విషయమన్నావ్ ! నాన్నగా రంటావ్, అమ్మగా రంటావ్, ఏమిటది వసూ?"

వసుంధర నవ్వేసింది. "మీ నాన్నగారు తాతయ్యా, అమ్మగారు బామ్మా కాబోతున్నారు."

"అమ్మ దొంగా !" అంటూ రాజారావు లేచేసరికే వసుంధర అక్కణ్ణించి పారిపోయింది.

ఆరోజు ఆదివారం కావడం, వసుంధర చక్కని వార్త చెప్పడంతో రాజారావు మనస్సు మధురమైన వూహలతో నిండిపోయింది.

తను తండ్రి కాబోతున్నాడు. తన ఇంటికో చిన్ని పాపాయి రాబోతోంది. ఈ ఆలోచన రాగానే అతనికి పుట్టబోయే పిల్ల ఆడా, మగా అనే సందేహం వచ్చింది.

ఎవరయితే బాగుంటుందా అని అతను ఆలోచించాడు ఎవరైనా బాగానే ఉంటుందని అతనికి అనిపించింది కానీ వూహించుకునేందుకు—ఎవరో ముందు తెలిస్తేనే చాలా బాగుంటుంది.

అతను సరదాగా లాటరీ వేశాడు. పుట్టబోయేది మగపిల్లవాడేనని వచ్చింది.

"వంటయింది—రావచ్చు !" అంది వసుంధర అతని ఆలోచనలకు భంగం కలిగిస్తూ. రాజారావు లేచి ఆమెను అనుసరించి వంటింట్లో ప్రవేశించి పీటమీద కూర్చుంటూ అన్నాడు. "నీకో మంచివార్త చెప్పనా ?"

"చెప్పండి !"

"త్వరలో నీకు కొడుకు పుట్టబోతున్నాడు !"

వసుంధర మళ్లీ సిగ్గుపడిపోయి

ఏమనాలో తెలియక— "ముందు వడ్డిం కలపండి!" అంది.

అన్నం కలుపుతూ రాజారావు మళ్ళీ అన్నాడు. "అబ్బాయికే పేరు పెట్టాలో అప్పుడే నిర్ణయించేశాను !"

వసుంధర ఉలిక్కిపడింది. "అదేమిటి— నన్నడక్కుండానే !"

"ఆఁ !"

"ఏమిటో చెప్పండి ?"

"మా నాన్నగారి పేరే !"

రాజారావు ముఖంలో కనిపించే హుషారు వసుంధర ముఖంలో కనిపించలేదు. "అయినా పేరు కిప్పుడేమంత తొందరొచ్చిందిలెండి!" అని వూరుకుంది.

కూర తినడం అయి పులుసులోకి వచ్చాడు రాజారావు. "మా నాన్నగారి పేరు పెట్టడం నీ కిష్టమున్నట్లు లేదే !"

"ఇష్టం మెందుదుకులేదు కానీ—ముందు అన్నం తినండి—చెబుతాను."

రాజారావు మారాం చేయకుండానే భోం చేసేశాడు. ఇద్దరి భోజనాలూ అయేక తమలపాకులు నములుతూ ఇద్దరూ మళ్ళీ చర్చ మొదలుపెట్టారు.

"ఏమండీ !" అంది వసుంధర గోముగా. రాజారావు ఆ పిలుపుకి కరిగిపోతూనే వోసారి తలెత్తి భార్యని చూశాడు. "బాబుకి మా తాతగారిపేరు పెడదామండీ!"

రాజారావు ఆశ్చర్యంగా భార్యవంక చూశాడు. "నువ్వింకా బాబుపేరు గురించే ఆలోచిస్తున్నావా ? అది నేను నిర్ణయించేశానుగా !"

"బాగుంది—ఇంక నా ఇష్టమేమీ అక్కర్లేదనుకున్నారేమిటి ? వాడికి మా తాత గారి పేరు పెట్టితీరాల్సిందే !"

దాంతో రాజారావు వాదనలోకి దిగాడు. "అలా వీల్లేదు— మా ఇంట్లో మొదటి పిల్లవాడికి తాతయ్య పేరే పెట్టడం అలవాటు. అది తప్పడం నా కిష్టంలేదు."

"అది కాదండీ—మా తాతగారి పేరు ఇంతవరకూ ఇంట్లో ఎవరికీ పెట్టలేదండీ— మా నాన్నగారికి అందరూ ఆడపిల్లలే గదా !"

"అయితే నేనేం చెయ్యను ? మీ తాత గారి పేరు పెట్టడం ఆ భగవంతుడికే ఇష్టం లేదన్నమాట !"

భగవంతు డనగానే వసుంధర కేదో తట్టింది. "మరి మగపిల్లవాడు పుడితే నీపేరు పెట్టుకుంటానని అన్నవరం దేవుడికి మొక్కుకున్నానండీ !" అంది.

కానీ అది అక్షరాలా అబద్ధం—ఆమె తాత గారి పేరూ, అన్నవరం దేవుడిపేరూ ఒకటే కావడం మూలాన ఆమె అలా అంది. అయితే రాజారావందు కేమీ తీసిపోడుగా— "మరి నేను వెంకటేశ్వర స్వామికి మొక్కుకున్నాను—నీపేరు పెట్టుకుంటానని — ఎలాగ మరి?" అన్నాడు. అతని తండ్రిపేరు వెంకటేశ్వర్రావు.

వసుంధర ముఖం చిన్నబోయింది. ఆమెకు ఉక్రోషంకూడా వచ్చింది. వీటి ఫలితంగా కళ్లలో నీళ్లు కూడా తిరిగాయి. ఆమెను పరిశీలనగా చూస్తున్న రాజారావు జాలిపడి—"అదికాదు వసూ! మరోలా అనుకోకు, కొడుకుపుడితే వాడికి నాపేరే అని నాన్నగారెంతో సరదాపడుతూండేవారు. నువ్వే చూశావుగా—"—అని అయిదు నిముషాలాగి "నాకు జాతకంలో అయిదుగురు పిల్లలనీ, అందులో ముగ్గురు మగపిల్లలనీ ఉంది. అంచేత రెండోవాడికి పోనీ మీతాతగారిపేరే పెట్టు కుందువుగాని ఏం?" అన్నాడు అనునయంగా.

అయితే దానిమీద వసుంధర ఎదురు దెబ్బతీసింది—"మరి నా జాతకంలో ఒక్కడే మగపిల్లవాడని ఉందిట—అంతకీ మీ జాతకమే నిజమైతే పోనీ ఆ రెండోవాడికే మీ నాన్నగారి పేరు పెడదాం!"

ఈసారి ఉక్రోషపడేవంతు రాజారావుదయింది—"ప్రతిదానికీ పెంకి సమాధానాలు చేతనయాయి. ఏమయినాసరే ఈ విషయంలో నామాట నెగ్గితీరవలసిందే!" అనేశాడు. వాదించడం చేతకానప్పుడు ప్రతి మగవాడూ ఉపయోగించే కోపాస్త్రాన్ని అతను ప్రయోగించాడు.

"ఏం? నామాటమాత్రం ఎందుకునెగ్గకూడదు?" వసుంధర రెచ్చిపోయి అంది— "బాబుకి మాతాతగారిపేరే పెడతాను!"

రాజారావు కోపం తారస్థాయికి చేరుకుంది. "ఇక వాదనలనవసరం, నామాట వినదల్చుకుంటే విను. లేదా నీ ఇష్టం! నీకూ నాకూ సంబంధం లేదు—"అన్నాడు.

వసుంధర తెల్లబోయి తమాయించుకుని, "మొత్తానికి మగవాణ్ణనిపించుకున్నారు— ప్రతీదానికీ ఇదో బెదిరింపయిపోయింది. ఇలాంటి బెదిరింపులకి నేనేం భయపడను. ఈ చిన్ని విషయానికే తెగిపోయేటంత బలమైన సంబంధం మనదైతే, ఆ సంబంధం నాకూ అవసరంలేదు." అని ఆగి, "అన్నయ్య దగ్గర్నుంచి రమ్మని ఉత్తరం వచ్చింది. నే వి

## రచయితలకి మనవి

1—4—1966 తర్వాత వ్రాత ప్రతులని తిప్పి పంపే విషయమై కొత్త పద్ధతిని అవలంబించవలసి వస్తున్నది. 1—4—1966 వరకూ మా కార్యాలయం చేరే వ్రాత ప్రతులతోబాటు తగు మాత్రం తపాలా బిళ్లలు జత పరచినట్లయితే తిప్పి పంపే ప్రయత్నాలు ఎప్పటిలాగే జరుగుతాయి.

1—4—1966 తర్వాత మా కార్యాలయానికి చేరే వ్రాత ప్రతులతో బాటు రచయిత (త్రు) లు తమ పేరు: చిరునామాతోబాటు తగు మాత్రం తపాలా బిళ్ళలు అతికించిన కవరులు పంపాలి. ఆ తేదీ తర్వాత ఇటువంటి (సెల్ఫ్ ఎడ్రెస్డ్ ఎన్వలప్స్ విత్ పోస్టేజ్) కవరులతోబాటు వచ్చిన వ్రాత ప్రతులే తిప్పి పంపటం జరుగుతుంది.

**ఉత్త తపాలా బిళ్లలు జతపరచి పంపరాదు!**

రచయితలు ఈ నిబంధనని గమనించి ఎప్పటివలె మాతో సహకరించగలరని ఆశిస్తున్నాము.

సంపాదకుడు,
ఆంధ్ర సచిత్ర వార పత్రిక.

కాశే మా పుట్టింటికి వెడుతున్నాను" అంది!

రాజారావు తెల్లబోయాడు. వసుంధర ఆవేశపరురాలని అతనికి తెలుసును. ఇలా చీటికీ మాటికీ అలిగి పుట్టింటికిపోతానని బెదిరించడమూ, అప్పుడప్పుడు నిజంగానే వెళ్లి కొంతకాలముండి వస్తూండడమూ అలవాటే!

అయినా ఇప్పటి పరిస్థితివేరు. ఈ కోపంలో పుట్టింటికివెళ్లి రెండు నెలలుంటుందో, తర్వాత నెలలు నిండుతున్నాయని వాళ్ళు పంపరు. అంతకాలం—వసుంధర లేకుండా తను జీవించగలడా? కలవారి అమ్మాయిని చేసుకోవడంవలన ఏం అవస్థ వచ్చిపడిందిరా భగవంతుడా? అనుకున్నాడతను.

క్షణమాత్రం అతను తనలోని పురుషత్వపు అహంకారాన్ని ఏమాత్రమూ చావనీకుండా—"సరే—వెళ్ళు! కానీ ఒకటిమాత్రం గుర్తుంచుకో—వెడితే మళ్లీ ఇంక రావనక్కరలేదు!" అని "ఆదివారంనాడైనా ఈ ఇంట్లో విశ్రాంతి లేదుకదా!" అని నిట్టూర్చి బట్టలు మార్చుకుని వీధిలోకిపోయాడు.

మధ్యాహ్నం మ్యాట్నీ చూసి బయటకొచ్చేసరికి అతని కోపం చాలావరకూ శాంతించింది. సాయంత్రపు చల్లగాలిలో అటూ ఇటూ తిరిగి అతను ఇంటికి వచ్చేసరికి తలుపు తాళం వేసి ఉంది. తాళం కప్పుకు ఓ చీటీ పెట్టి ఉంది.

"నేను మా వాళ్లింటికి వెడుతున్నాను. తాళం పక్కింటి పిన్నిగారికిచ్చాను" ఇదీ ఆ చీటీలో రాసి ఉన్న విషయం. ఆ చీటీచూసేసరికి రాజారావుకి పోయిన కోపమంతా తిరిగి వచ్చింది. ఆడదానికి ఇంత అహంకారమా? అనుకున్నాడతను. బహుశా మగవాడికైతే అహంకారం ఉండవచ్చునని అతని భావమై ఉంటుంది.

పక్కింటి పిన్నిగారిదగ్గర తాళం తీసుకుని ఇంట్లో ప్రవేశించాడతను. వసుంధర లేని ఆ ఇల్లు అంధకారంతో నిండి శూన్యంగా ఉంది.

మంచంమీద పడుకుని అతను ఆలోచించసాగాడు.

వసుంధర నిజంగా వెళ్లిపోతుందని తనను కోలేదు.

## పేరులో ఏముంది?

అతనికి భార్యమీద విపరీతమైన కోపం వచ్చిందికానీ—ఆలోచించినకొద్దీ ఆ కోపం మళ్లీ తగ్గసాగింది.

అవునుమరి—వసు ఆవేశపరురాలు. అటువంటి ఆమెకు ఆట్టే ఆవేశం తెప్పించకూడదు. ఆవేశపరుడైన మగడితో వేగుతూన్న ఇల్లాళ్లెందరులేరు? వాళ్ల బాధ లెవరు గుర్తిస్తారు?

అయినా భార్యా భర్తలకి పట్టుదలలూ, పంతాలూ ఏమిటి? నిత్యం కలసి మెలసి ఉండడంతో ఎవరో ఒకరు ఏదో తప్పు చేస్తూనే ఉంటారు. ఏవో గొడవలువస్తూనే ఉంటాయి. సామరస్యంతో వాటిని పరిష్కరించుకోవాలిగానీ— శాశ్వత కలహానికి దారి తీయనీయకూడదు......

కానీ—తమది శాశ్వత కలహమవుతుందేమోనని భయపడ్డాడు రాజారావు. ఆరునెలలపాటు ఇద్దరిమధ్యా ఉత్తరాలు నడువలేదంటే రాజారావు భయానికి అర్థంలేదని ఎలా అనగలం?

తను ఉత్తరం ముందు రాయడానికి అతనికి అహం అడ్డు వచ్చింది. మరి ఆమెకూ అంతేనేమో!

ఎంత అహం అడ్డు వచ్చినా రాజారావు గుర్తించగలిగిన నిజం ఒకటుంది. వసుంధర లేకపోతే తన జీవితంలేదు. ఆమె తన జీవితంలో కొరవడిన ఏదో లోపాన్ని పూర్తి చేసింది. ఆమెలేని ఇల్లు ఇప్పుడుశూన్యంగా కనిపిస్తోంది.

"నన్ను క్షమించండి!" అంటూ వసుంధరవస్తే క్షమించడానికి సిద్ధంగా ఉన్నాడతను.కానీ,ఆమె క్షమించమంటూరావాలిగదా!

ఏమయితేనేం—ఆరునెల్ల రెండు వారాలకు ఒక టెలిగ్రాం వచ్చింది రాజారావుకి. ఆ టెలిగ్రాం చూడ్డంతోనే అతని కోపమంతా హరించుకుపోయి—"పిచ్చి వసూ!" అని నవ్వుకుని వెంటనే ఆమెకు ఉత్తరం రాయడానికి సిద్ధపడ్డాడు.

"ప్రియమైన చి. సౌ. వసుంధరకు,

అనవసరంగా చిన్న విషయానికి ఇద్దరం తగువు పడ్డాం. విడిపోయాం. ఏమైతేనేం? నాకు నీకంటే కుర్రాడిపేరు ముఖ్యం కాదని తెలిసొస్తోంది—ఇవాళ్ళ విరహాననుభవించేక ... అయినా 'పేరులో ఏముంది వసూ! కాబట్టి అబ్బాయికి నీ ఇష్టం వచ్చిన పేరుపెట్టుకో. అనవసరంగా నీ మనస్సు నొప్పించినందుకు నన్ను క్షమించు. తొందరలోనే వచ్చి నాకు వెలుగును ప్రసాదిస్తావని ఆశిస్తాను. నీ జవాబుకై ఎదురుచూస్తూ, నీ

రాజారావు."

ఉత్తరానికి క్రితంరోజు అనగా మంగళవారంనాటి తేదీవేసి కవర్లోపెట్టి పోస్ట్ చేశాడు. ఉత్తరం పోస్ట్ చేశాక అతని మనస్సు తేలిక పడింది—"అమ్మయ్యా—మా గొడవ చివరికి ఇలా పరిష్కారమయిందన్నమాట!" అనుకుని తేలికగా నిట్టూర్చాడు.

మర్నాడే సాయంత్రం పోస్టులో వసుంధర దగ్గర్నుంచి అతని కొక ఉత్తరం వచ్చింది. అతను ఎంతో ఆత్రుతగా ఆ ఉత్తరాన్ని చదువుకున్నాడు.

"శ్రీవారి పాదపద్మముల సన్నిధికి వసుంధర నమస్కరించి వ్రాయునది.

ఆరోజు నేనువచ్చినప్పటినుంచీ ఎంతో బాధ పడుతూనే ఉన్నాను. ఉత్తరం రాయాలనే ఉండేది. కానీ మీరు వ్రాసేక వ్రాద్దామనే పట్టుదలకొద్దీ రాయలేదు. ఆలోచించగా నాదే తప్పేమోననిపించింది. అనవసరంగా మీ మనస్సుని నొప్పించాననిపించింది.అందుకే మీరు ఉత్తరం రాయకపోయినా నేనేముందు వ్రాస్తున్నాను.

'పేరులో ఏముందని మనిమంత పట్టుదలతో వాదించుకున్నామో నాకర్థంకావడం లేదు. పిల్లవాడికి మీ ఇష్టం వచ్చిన పేరు పెట్టుకోండి. అందుకు నేను ఎటువంటి అభ్యంతరమూ చెప్పను. నన్ను క్షమించి జవాబు త్వరగా ఇస్తారని ఆశిస్తూ,

మీ

వసు"

రాజారా ఒకసారి భుజాలు తడుముకుని ఉత్తరం వ్రాసిన తేదీ చూశాడు. తను వేసిన మంగళవారంనాటి తేదీయే ఉంది! అంటే ఆమె కూడా తనలాగే ఆడపిల్ల పుట్టిందని తెలిశాక ఈ ఉత్తరం వ్రాసిందా? లేక నిజంగానే ఆమెలో మార్పువచ్చిందా?

జవాబు రాజారావుకే తెలియాలి. ●

# 1970 లో ౦-౦.౦౦౦ రోజు























సీరియల్

# కరుణా






కొండముది శ్రీరామచంద్రమూర్తి

### జరిగిన కథ

జమదగ్ని భార్య శారదాంబ తన కుమారుడు ప్రసన్నతోబాటు విశ్వనాథంగారమ్మాయి కరుణను కూడా పెంచి పెద్దచేస్తుంది. పెద్దకుమారుడైన మన్మథను జమదగ్ని తమ్ముడు చలపతి పెంచుకుంటాడు. కరుణ—ప్రసన్నలకు వివాహ మవుతుంది. మన్మథ కూడా పై చదువులు చదవటానికి నిశ్చయించుకుంటాడు. కరుణ, మన్మథ, వీరభద్రం ఎం. ఏ. లో చేరటానికి వాల్తేరు వెళ్తారు. ప్రసన్న ఉద్యోగ ప్రయత్నం సఫలమవుతుంది. పెడదారి పట్టిన వీరభద్రాన్నివార్చటానికి మన్మథ చేసిన ప్రయత్నం విఫలమవుతుంది. తన ప్రయత్నాన్ని విఫలంచేసిన మన్మథపై ప్రతీకారాన్ని తీర్చుకోడానికి సింహాద్రి అవకాశం కోసం ఎదురు చూస్తుంటాడు. పరిస్థితుల ప్రభావానికి లోనై నాటకంలో మన్మథతో నటించడానికి ఒప్పుకున్న కరుణకు ప్రసన్న వాల్తేరు వస్తున్నట్లు రాసిన ఉత్తరం కలవరపాటును కలిగిస్తుంది. మన్మథతో తను నటించలేనని చెప్తుంది కరుణ. మన్మథ దగ్గరికి వచ్చిన ప్రసన్న అతని ప్రవర్తన చూసి విస్తుపోతాడు.

## 25

ప్రసన్నకు, మన్మథను చూచినా అనుమానంగానే ఉన్నది. తన నొక గూఢచారి క్రింద జమకట్టి ఉంటారు వాళ్లు. తాము ఆయనను డబ్బుకోసం పీడించడం, ఆస్తి తాకట్టు పెట్టమనడం అంతా ఆ ముసలాయన మన్మథతో చెప్పి ఉంటాడు! అదే అయిఉంటుంది. లేకపోతే మన్మథ మౌనానికి అర్థం లేదు. తన దగ్గరకు వచ్చిన మన్మథతో, "నువ్వూ, బాబాయ్ లాగానే అనుకొంటున్నావా ?" అని అడిగాడు ఆత్రుతతో.

మన్మథ సమాధానం చెప్పటానికి ఇరకాటాన పడ్డాడు. చలపతిని చూస్తే తనకు జాలి, అందుచేతనే ఆయన గీచిన గిరిలోంచి తను కదలలేడు. తమ్ముడిమీద తనకు ప్రేమ. ఆ ప్రేమకు ఇదీ అన్న స్వరూపం లేదు. తను రెండు ప్రపంచాలకు చెందిన మనిషి, రెండు కుటుంబాల మధ్య వంతెన, రెండు అనుభూతులకు కూడలి.

మన్మథ మాట్లాడకుండా, తన ప్రశ్నకు సమాధానం చెప్పక వూరుకోవడంతో, ప్రసన్నకు తన వూహలే, అనుమానాలే నిజమనిపించాయి. 'మరొక్క నిదర్శనం చాలు తనకు, మన్మథ తనవాడు కాదనుకోవడానికి, మనసు గట్టి చేసుకోవడానికి. ఆ నిదర్శనం కోసమనే మరో ప్రశ్న అడిగాలనుకొన్నాను. చలపతి అతనికి ఆ అవకాశం ఇవ్వలేదు.

"ఇప్పుడిప్పుడే అక్కడకు వెళ్లడం దేనికి ? యూనివర్శిటీ చూదాం పద" అన్నాడు చలపతి. ప్రసన్న అనంగీకారం అల్పాడు. "ఊహు, ఇప్పుడు కాదు. రేపో, ఎప్పుడో చూడొచ్చు. ప్రొఫెసర్ నీలకంఠంగారి ఇంటికి వెళ్దాం పదండి."

ప్రసన్న మనస్సు మన్మథకు తెలిసింది. ఆత్రుత ఎంతగా అణగార్చుకొని ఆ వ్యక్తి తనను ఆవిధంగా అడిగాడో అర్థమైంది. మనసు కరుణాప్లావితమైంది. కానీ ఇంతలోనే తనమధ్యా కరుణ మధ్యా చెలరేగిన కంటికి కనిపించని బాధామారుతం అతన్ని కలచివేసింది. కరుణకు తనంటే కరుణ లేదు. అడుగడుగునా తన నొక బొమ్మ క్రింద తీసిపారవేసింది! తనను నమ్మలేకపోయింది. తన వ్యక్తిత్వాన్ని చులకన చేసింది! ఆ వ్యక్తి దగ్గరకు, తమ్ముడితో వెళ్లి తను మరింత చులకన ఎందుకు కావాలి ?

ఆర్ద్రంగా, బాధా మిళిత స్వరంతో అన్నాడు. "రాలేను తమ్ముడూ ! నువ్వే వెళ్లిరా ! అక్కడికి నేను రావడం కుదరదు."

ప్రసన్న మనస్సు, ఆ సమాధానం వినడంతో రాయైపోయింది. "సరే. అయితే! నేనే వెళ్తాను." అన్నాడు. మన్మథకు ప్రసన్నను చూస్తున్నకొద్దీ, అతని మీద అతనికే కోపం వస్తున్నది. 'కొద్ది వందల మైళ్ల దూరం నుంచి వచ్చాడు వాడు ! వాడికి ఇదేనా తను చేసే మర్యాద.' అని అంతరాంతరాళాల్లోంచి అతన్ని ఎవరో ప్రశ్నిస్తున్నారు.

ముందుకు అడుగు వేసిన ప్రసన్నను అనుసరించడానికి సిద్ధపడుతున్న మన్మథను చేయి పట్టుకు ఆపి, "అన్నీ చూసుకుంటూ ఆ నాటకాలాడే చోటుకు మెల్లగా చేరుకుందాం పద." అన్నాడు చలపతి. మన్మథ యూపస్తంభానికి కట్టివేయబడ్డ బలి పశువులా ఆగిపోయాడు. అతనికి తను ప్రసన్నను వంటరివాణ్ని చేశాననిపిస్తున్నది. కనీసం ఆ యింటికి చిరునామా అయినా తెలుసుకోకుండా వాడు వెళ్లిపోతున్నాడు. "ఒరెయ్ ! అడ్రస్‌రా !" అని బిగ్గరగా వెనుకనుండి కేక వేశాడు. "అక్కర్లేదు. ఎవర్నడిగినా చెబుతారు." ప్రసన్న కంఠస్వరం ఆ హాస్టలు బిల్డింగుల్లో ప్రతిధ్వనించింది.

"ఏమిటా తలబిరుసుతనం ?—మన వెంట రానంటా వేమిటి ? పెళ్ళాన్ని రేపు చూసుకో కూడదా ఏమిటి ?" అన్నాడు చలపతి, ముందుకు నడుస్తూ, మన్మథను చేయి పట్టుకు ముందుకు నడిపిస్తూ. మన్మథ కంటిలో ఒకే ఒక కన్నీటి చుక్క. అతని హృదయంలో బడ బానలంలా, చెప్పలేనంత బాధ. మనసు, ప్రసన్నతో ఉండగా, చలపతి వెంట నడ వడం ప్రారంభించాడు.

* * *

మెడలో అలంకరించుకున్న నెక్లెసును తీసి పెట్టెలో పెట్టేసి, కట్టుకున్న టెరిలిన్ చీర విప్పి, మరో నూలు చీర కట్టుకుని, చేతి గడియారం తీసి టేబిలు మీద పెట్టి, కాళ్ల చెప్పులు విప్పి మూలన పెట్టి, మొహాన క్రమ్మిన చిరు చెమటనైనా తుడుచుకోకుండా, స్టేషను నుంచి వచ్చిన కరుణ, నిరాశతో, స్నేహితుల ముందు బయట పడిపోయానన్న సిగ్గుతో ఉస్సురంటూ పేము కుర్చీలో ఫాను ముందు చతికిలబడింది. ఆమెవేపు చూస్తూ మరో కుర్చీలో నున్న సబిత ఫక్కున నవ్వింది తన స్నేహితురాల్ని చూసి. "ఏమిటక్కా ఆ ఆకారం !—కాటుక చెంపలనిండా అయింది, బొట్టు చెరిగి పోయింది, తల దువ్వుకోనట్లుగా ఉంది, కొంపతీసి కోపగృహం ప్రవేశించడం లేదు కదా ?"

"కోపం కూడానూ ఈ అభాగ్యురాలికి!"

సబిత లేచివచ్చి కరుణ కూచున్న కుర్చీ పక్కనే మద్రాస్ చెయిర్ వేసుకుని, దాన్ని దగ్గరకు లాక్కుంటూ కూచుని. "అంత నిరాశ పడిపోతే ఎల్లాగే ?—ప్రయాణం బావగారు మానుకొన్నారో-ఏమో!" అన్నది.

కరుణ, సబితవేపు బేలగా చూసింది. "అంతే నంటావా ?"

"అంతకాక ? వస్తే, ప్లాట్‌ఫారం మీద నీకు కనిపించకుండా ఉండటానికి ఆయనేమీ నల్లపూస కాదుగా ? వచ్చి ఉండరు. అంతే."

"అది కాదే ! నేను వెళ్లేనరికి, అప్ప టికే మెయిల్ వచ్చి పావు గంట దాటిం దటం."

"అయితే ఆయన వచ్చి నిన్ను చూడ కుండా ఎక్కడికన్నా వెళ్లేరంటావా ?"

కరుణ మాట్లాడలేదు. ఆమెలో లీలగా అనుమానం. ఒకవేళ ప్రసన్న బండి దిగి, సరాసరి తన అన్నగారి గదికి వెళ్లా డేమోనని! కానీ, అలా వెళ్లడని మరో ధైర్యం, నమ్మకం.

సబిత లేచి, కుంకుమ తీసుకువచ్చి, కరుణ నొసటిని తన పమిటచెంగుతో



తుడిచి, అందంగా కళ్యాణ తిలకంలా తీర్చి దిద్దింది. కాటుక అంటిన చెంపలకు పమిటచెంగు గాలి విసరింది. దువ్వెనతో ఆమె కురులు విసిరింది. "నా అక్క అందా నికి మారుపేరు ! విచారంగా, వికారంగా ఉంటే నేను చూడలేను. ఏదీ, ఒక్క నవ్వు ! నవ్వవమ్మా ! బావగారు వచ్చిం తర్వాత, ఎలాగూ మమ్మలను చూచి నువ్వు నవ్వనే నవ్వుతావు. ఆ నవ్వులను ఆయ నకు పంచుతావు. ఇప్పుడైనా ఆ పువ్వుల్ని మమ్మల్ని ఏరుకోనీ !"

"పోవే, కొంటె కోణంగి !"

ఇద్దరూ గుమ్మంవేపుకు వీపు పెట్టి మాట్లాడుకొంటున్నారు. ఎదురుగా నిలువు టద్దం గోడమీద అందంగా నగిషీతో ఉన్న అద్దం వాళ్లను తనలో ఇముడ్చు కొని మరింత అందంగా నిండుగా కన్పిం చింది. ఉన్నట్లుండి, వాళ్ల మనస్సుల్లో ఉన్న కోరిక తెలుసుకొన్నట్లుగా వాళ్లకు మూడో రూపాన్ని చూపెట్టింది. యాదా లాపంగా తలఎత్తి అద్దంలోకి చూసిన సబిత 'ఎవరు ?' అంటూ వాకిట్లోకి నడిచింది.

"ప్రొఫెసర్ నీలకంఠంగారి ఇల్లు ఇదేనా అండి ?" ప్రసన్న అడుగుతున్నాడు.

"ఆఁ ! ఇదే. వారు ఇప్పుడు రారు. రాత్రి చాలా ప్రొద్దుపోతుంది. ఇవ్వాళ అక్కడ నాటకాలూ అవీ ఉన్నాయి, అంచేత !—మీరు మరోసారి రండి."

"సబితా ! సబితా!" సబిత తన ధోర ణిలో తాను మాట్లాడుతూ కరుణ మాటలు వినిపించుకోలేదు. ప్రసన్న ఆ

# కరుణ

అమ్మాయి మాటలను, ఆమె వెనుక నిలబడి సంజ్ఞ చేస్తున్న కరుణనూ చూస్తూ, నవ్వుతూ, "సరేలెండి. వారు వచ్చేవరకూ ఇక్కడే కూచుంటాను." అంటూ మెట్లు ఎక్కి వరండాలోకి వచ్చాడు. అంతవరకూ తన వెనుక సిగ్గుల పెళ్లికూతుర్లా నిలబడ్డ కరుణను ఆమె కంగారును గమనించని సబిత, అప్పుడు విషయం అర్థం చేసుకుని, నాటకాన్ని చివరివరకూ రక్తి కట్టించాలని, "దయచేసి మీరు బయటికి వెళ్లి, మళ్లీ మా నాన్నగారు వచ్చిం తర్వాత రండి. ఇంట్లో మేం ఇద్దరమే ఆడపిల్లలం ఉన్నాం." అన్నది కోపం నటిస్తూ.

"మరి మంచిదండి! నేను కూడా ఒక్క అమ్మాయి కోసమే వెతుకుతున్నాను. ఆ అమ్మాయి ఇక్కడే ఉన్నట్టుంది. ఏం కరుణా?" ప్రసన్న స్వతంత్రంగా లోపలకు వచ్చేశాడు. కరుణ అతన్ని గదిలోకి తీసుకువచ్చింది. కుర్చీలో కూచోపెట్టి, సబిత కోసం చూసింది. ఏదీ సబిత? ఫాను ప్రసన్నవేపు తిరిగేట్టు పెట్టి, "ఇదేనా రావడం? పెట్టె బెడ్డింగు ఏవీ? అమ్మయ్య! ఇప్పటికైనా కదిలి వచ్చారు. ఎంతకాలంగా మీకోసం ఎదురు చూస్తున్నానని! అయినా మీరు ఉద్యోగస్థులయ్యారుగా? ఈ అభాగ్యురాలు జ్ఞాపకం ఉండొద్దూ?" అన్నది నిష్ఠూరంగా.

ప్రసన్న, కరుణవేపే చూస్తూ తన మనస్సులోని అనుమానాన్నీ, బాధనూ కొంతసేపు మర్చిపోయ్యాడు! ఎంత అమాయకంగా ఉంది కరుణ మొహం! అప్పుడే విచ్చిన మల్లెమొగ్గలాగా, నవ్వడం నేర్చిన పసిబిడ్డలాగా, స్పృశించి పరవశింపజేసే పైరుగాలిలాగా, పారడం మొదలెట్టిన నదిలోని నీళ్లలాగా, స్వచ్ఛంగా, సుకుమారంగా, హాయిగా, అందుకోలేనట్టుగా ఉంది ఆమె!!

లేచి నిలబడి, "అది కాదు కరుణా!.... నేను ...." ముందుకు అడుగు వేశాడు.

"బావగారూ! పాపం, చాలా చాలా అలసిపోయి వచ్చారు? కాఫీ టిఫిన్ రెడీ!" అంటూ వెనగ్గా వంట పుట్టె చేతిలో వెండి పళ్లెంతో సహా వచ్చింది సబిత. వచ్చి, టేబిలుమీద అన్ని అమర్చి, "తీసుకోండి" అంటూ ప్రసన్నవైపు చూసింది అతను మొహమాట పడ్డాడు. "ఓహో! నన్ను నేనే పరిచయం చేసుకుంటాను నేను మీ ఆవిడ చెల్లెల్ని. నీలకంఠంగారి కూతుర్ని. కరుణ క్లాస్‌మేటును. చాలా?" అంటూ నవ్వింది సచిత.

"చాలు. చాలు." ప్రసన్న మొహమాటం పోయి మాట కలుపుతూ అన్నాడు. "కరుణకు ఇటువంటి చెల్లెలున్న సంగతి నాకు తెలీదు."

"నాకు ఇంతటి పిరికి బావగారున్న సంగతి నాకే తెలీదు."

"మాటలు నేర్చిన కోయిలను కవ్వించడం ప్రమాదం సుమా!"

"పోనీలెండి. సామెతను మార్చినందుకు మెనీ థ్యాంక్స్."

ప్రసన్న కాఫీ తీసుకున్న తర్వాత, కప్పులను లోపలికి పట్టించుకొని వెళ్తూ, "ఏం అక్కా? ఇందాకట్నుంచి మూతి బిగించుకు కూచున్నావ్? రావలసినవారూ, కావలసిం వారే వచ్చారుగా?— ఇంకా ఎందుకు మవునం?— మాట్లాడుకో!" అంటూ వారిస్తూన్నా, బయటికి వెళ్లిపోయింది. ●

"మొత్తంమీద మీ చెల్లెలు అసాధ్యురాలే!" అన్నాడు ప్రసన్న, సంభాషణకు నాందిగా.

"నా వంటరితనం జ్ఞాపకం రాకుండా అదే నాకు ఇంతకాలం అండగా ఉంది."

ప్రసన్న చేతులు తన బుజాలమీద పడేసరికి కరుణకు కొత్త అనుభూతి, పూర్వమెన్నడో అనుభవించినది, ఈమధ్యన శరీరపు మడతలలో దాగి బాధపెట్టినది, ఏదో కల్గింది. ఆమెలో కల్గిన పులకలను తాను పంచుకొంటూ, "ఆడవారి దగ్గరకు వట్టి చేతులతో రాకూడదంటారు. ఈ పువ్వులకన్నా ఏమి సుందరమైనది నీకెయ్యగలను?" అంటూ తాను భద్రముగా తీసుకువచ్చిన గులాబీల దండను ఆమె తలలో అలంకరించి, ఆమె నొసటిని ముద్దుపెట్టుకున్నాడు. కరుణ అనుమానంగా తలుపువేపు చూసింది.

ప్రసన్న మరోసారి గాఢంగా ఆమె పెద వులను ముద్దుపెట్టుకున్నాడు. "ఈ క్షణం కోసం మూడు నెలల నుంచి ప్రయత్ని స్తున్నాను కరుణా !" అన్నాడు బరువుగా

కరుణ అతని కౌగిలిలో గువ్వ పిట్టలా వొదిగిపోయింది. అతని చొక్కా గుండీలు సర్దుతూ "నా ఉత్తరాలే రప్పించాయి కదూ మిమ్మల్ని ?" అన్నది.

"నానుంచి ఉత్తరాల్లేక నువ్వు బాధ పడ్డావు కదూ ?"

"ఏం బాధో ? ఆ బాధంతా ఒక ఎత్తూ, ఇందాక స్టేషనుకు వచ్చి మీరు కన్పించక పోయేసరికి పడ్డ బాధ ఒక ఎత్తూనూ !" అన్నది.

ప్రసన్న తాను ప్లాట్‌ఫారంమీద దిగడం, ఎవరూ కనిపించక పోవడం, సరాసరి ప్రొఫెసరుగారి ఇంటికి రావడానికి మొహమాట పడటం, మన్మథ దగ్గరకు వెళ్లడం వరకూ చెప్పి, "నన్ను క్షమించు కరుణా ! వూళ్లోకి వచ్చి కూడా, నిన్ను చూడక కొన్ని గంటలు ఆలస్యం చేశాను" అన్నాడు

"అంతేకాదు. నాకన్నా, మీ అన్నగారే మీకు ఎక్కువని కూడా నిరూపించుకొన్నారు"

"అన్నగారు,!" కరుణను మరింతగా హత్తుకొన్నాడు హృదయానికి. "వాడొక విచిత్రమైన మనిషి కరుణా ! అన్నట్టు ఇక్కడ కూడా నాటకాల్లో వేషాలు వేస్తున్నాడట కదూ?" కరుణ కళ్లల్లోకి చూశాడు.

కరుణ, అతని సూదుల్లాంటి కళ్లనుండి తన కళ్లను తప్పించుకొన్నది. అతని జుత్తులోకి వ్రేళ్లు పోనిచ్చి దువ్వుతూ "మా ఆడబిడ్డ ఏం చేస్తోంది ?" అని అడిగింది, విషయం మారుస్తూ

ప్రసన్న చిలిపిగా ఆమె బుగ్గపై ఒక చిటికె వేస్తూ "నీలాగే కలవరిస్తోంది" అన్నాడు.

దూరంగా ఎవరో మనుష్యులు వస్తున్న చప్పుడు, గేటు తీసినట్లయింది. అయిష్టంగా ఇద్దరూ దూరంగా జరిగి కూచున్నారు.

ప్రొఫెసర్ నీలకంఠంగారు ఇంటికి చీటీ పంపించారు. అప్పటికే చాలా ఆలస్యమైపోయిందనీ, లక్ష్మీకాంతంగారు తమ ఉపన్యాసం మొదలుపెట్టేసేరనీ, ఆలస్యం చేయకుండా వెంటనే రమ్మనమనీ అందులో సారాంశం.

కరుణ చీటీ చదువుతూండగానే, లోపలినుంచి సబిత, బెంగాలీ యువతిలా సింగారించుకొని ముందు గదిలోకి వచ్చింది. ఆ చీటీ వంక చూస్తూ, "నాన్నగారి దగ్గర్నుంచేనా ??" అన్నది. అని ప్రసన్నవేపు చూస్తూ, "బయులుదేరండి. బావగారికి టిక్కట్టు లేకుండా ఎంటర్‌టెయిన్‌మెంట్ ఏర్పాటు చేయించాం." అన్నది.

ప్రసన్న అయిష్టంగా మొహం పెట్టాడు "తల నొప్పిగా ఉంది. తప్పదూ ?" అన్నాడు.

కరుణ లోలోపల నవ్వుకొంది ఆ కొంటెతనానికి. చీటీ తెచ్చిన కుర్రవాణ్ని పిల్చి, "వూరి నుంచి ప్రసన్నగారు వచ్చారట. వారికి తలకాయ నొప్పిగా ఉందట. కరుణమ్మగారు రారట అని చెప్పు. వెళ్లు" అన్నది. ఆ చీటీ తెచ్చిన కుర్రాడు అట్లాగేనంటూ వెళ్లిపోయాడు.

అతను వెళ్లిం తర్వాత, సబితను ప్రయాణానికి సిద్ధం చేసింది కరుణ. "మేం ఎటూ రావడంలేదు. నువ్వయినా వెళ్లవేం ? ఆలస్యము ఎందుకూ ?"

"నాకూ తలకాయనొప్పిగా ఉందమ్మా ! నేనూ వెళ్లను ," ఉస్సురంటూ తల పట్టుకొంది సబిత.

"అయితే ఇక్కడెందుకూ, డాక్టరు దగ్గరకు వెళ్లండి." అన్నాడు ప్రసన్న.

"ఇద్దరం వెళ్దాం రండి. ఒక రోగికి మరో రోగి తోడు ఉండడం ఎందుకైనా మంచిది."

"ఇంత మొండి ఘటమేం ?" అన్నట్లుగా చూశాడు ప్రసన్న, కరుణవైపు. కరుణ తల బాదుకొంది. సబిత లోలోపల నవ్వుకొంది.

"పాపం ! వూరినుంచి రాకరాక వచ్చారు. ఏ సినిమాకో, ఏ బీచికో, సర్దాగా వెళ్లక, ఈ తలనొప్పి ఎక్కణ్ణుంచి వచ్చిందండీ మీకు ?" అన్నది సబిత ఎంతో సానుభూతితో.

"పోనీ, ఆ సినిమాకైనా పోతే తగ్గుతుందేమో, కరుణా, వెళ్దామా ?"



ప్రసన్న అవకాశం జార విడుచుకో దల్చుకో లేదు.

"అవును సుమాండీ! నాకూ సినిమా అంటే ఎంతో ఇష్టం. ! పైగా అక్కగారి ప్రక్కన కూచుని చూడడమంటే, అదో అదృష్టం కింద భావించుకొంటాను." సబిత కూడా లేచి నుంచున్నది.

ప్రసన్నకు మనస్సులో ఉద్దేశ్యం చెప్పేద్దామన్నంత ఆవేశం వచ్చేసింది. "మహా తల్లీ ! నాకేమీ తలనొప్పీ లేదు. చట్టుబండలూ లేదు. ఇంట్లో ఉండి కాసేపు మా ఆవిడతో కబుర్లు చెప్పుకుందా మనుకున్నాను. అంతకుమించి మరొకటేం లేదు. నువ్వు సలక్షణంగా ఆ నాటకానికి వెళ్లిరా." అందామనుకొన్నాడు. సభ్యత అడ్డు వచ్చింది. మనసులో మాటలను నోరు బయట పెట్టలేదు. ముగ్గురూ బొమ్మల్లా కూచుని చూపులతోనే మాట్లాడుకొంటున్న సమయంలోనే ప్రొఫెసరుగారి బంట్రోతు మళ్లీ వచ్చాడు. మరో చీటీ పట్టుకుని. ఆ చీటీ ప్రసన్నకే ఉద్దేశించబడింది. అందులో, "మీ రాక నాకు ఎంతో సంతోషాన్ని కల్గజేస్తున్నది. సన్నూ నే తలకాయ నొప్పిని వెంట బెట్టుకొని వచ్చారని విని ఎంతో బాధపడుతున్నాను. గృహస్థుగా నా బాధ్యత కొంత ఉంది కదా ! భారం అనుకోక, కరుణనూ, సబితనూ వెంటబెట్టుకుని మీరు ఇక్కడకు రండి. మీకు తలకాయనొప్పి పోయే కార్యక్రమం ఇక్కడ ఉంది." అని ఉంది.

సబిత పర్యవేక్షణలో ఉండి, అటూ యిటూ కదలడానికి వీలులేక బాధపడడం కన్నా, ఈ నాటకానికి పోవడమే మంచిదని అనుకొన్నాడు. దాంతో లేచి నిలబడి, "మీ నాన్నగారు ఇన్వైట్ చేస్తున్నారు. పదండి పోదాం." అన్నాడు.

"మీ తలకాయనొప్పి"...సబితలో ఇంకా చిలిపితనం తగ్గలేదు.

"మన తలకాయ నొప్పి అనండి. లక్ష్మీకాంతంగారి ఉపన్యాసమూ, అహల్యా శాప విమోచనమూ చూస్తే పోతాయట. మీ నాన్నగారు అంటున్నారు."

"మిమ్మల్ని చూస్తే నాకు చాలా చాలా జాలేస్తోంది సుమండీ." సబిత బయటకు పారిపోయింది. కరుణ, శృంగారం పూర్తిచేసుకుని, 'వెళ్దామా ?' అన్నట్లుగా ప్రసన్న వేపు చూసింది. ప్రసన్న ఆమె చేతిని, తన చేతిలోకి తీసుకుని, మృదువుగా నొక్కి "హజ్బండ్స్ అంటే తమ భార్యలకు నమ్మకమైన సేవకులన్నమాట ! మీరు పదండి ముందు." అన్నాడు. వాతావరణంలో నవ్వులు. దూరంగా ఓ పక్షి కూజితం, సముద్రంమీద నుండి చిరుగాలి వచ్చి మెల్లగా పల్కరిస్తోంది.

*  *  *

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆరు బయట రంగస్థలం అదొక అపూర్వ ఇంద్రసభా ప్రాంగణం. రంగస్థలం తెరవేసి ఉంటే జాద్దాయతనంలా గోచరిస్తుంటుంది. తెర తొలగేసరికి ఆ రంగుల హొయలు, ఆ ఛాయల కదలికలు, కన్ను మూసి తెరిచే టంతలో కన్నులముందు మాయా ప్రపంచాన్ని దర్శింపజేసే విద్యుచ్ఛక్తి దీప కాంతులు, ఓహ్ ! ఆ రంగస్థలంమీద సముద్రం కొండగా మారుతుంది. వాటి కోటగా మారుతుంది. నిర్జీవి జీవవస్తువవుతుంది. ఆ రంగస్థలంమీద రంగు పూసుకొని పాత్ర ధరించడం పూర్వ పుణ్య విశేషం. అందునా, ఉత్తమమైన ప్రదర్శనాన్ని తిలకించడం ప్రేక్షకునికి దివ్యానుభూతి లభించడం. రెండూ సమకూడిన వాడు అది వర్ణన కందని విషయం.

'అహల్యా శాప విమోచనం' ప్రేక్షకులను మైమరపింప జేస్తోంది. మన్మథ ఇంద్రుని పాత్రలో జీవిస్తున్నాడు. రజని సిగ్గుపడడం, బెదురు చూపులతో పదను గుండెతో నటించలేకపోవడం అహల్య పాత్రకే అందాన్నిస్తున్నది. బ్రహ్మసృష్టి అహల్య, సృష్టికే తలమానికం కావడం అందరూ ఆమె కరగ్రహణార్థం తాము తామంటూ తగవులు పడడం, ఇంద్రు డామెను మోహించి అర్థించి విఫలమనోరథుడు కావడం, నారదుని సలహాపై గౌతముడు పెళ్లికొడుకై తరలి రావడం, ఆయన అహల్యను పొంద గల్గిన పద్ధతి, అహల్య త్రికరణశుద్ధిగా గౌతముని అర్ధాంగై ఆయన ఆశ్రమానికి తరలివెళ్లి గృహిణి బాధ్యతలను స్వీకరించడం. అక్కడితో మొదటిరంగం పూర్తయింది.

ఆ నాటకం చూస్తుంటే ప్రసన్నకు తానే గౌతముడు అనిపిస్తున్నది. అహల్యకన్న అందగత్తె కరుణ. అహల్యకన్న గుణవతి కూడా ! "మన్మథ ఇంద్రుడు వేయడం బాగానే ఉంది" అనిపించింది కరుణకు. తన కోసం ప్రయత్నంచేసి ప్రయత్నంచేసి, తాను ప్రసన్న పత్ని కావడంతో విఫలమైన కోర్కె గలవా డాయన. అక్కడితోనే ఆ పోలిక సమాప్తం. తనకు తాను అనుకొన్నది. "ఆ తర్వాత అతని ప్రవర్తన దోషరహితంగా, సమున్నతంగా ఎంత సంతృప్తికరంగా ఉన్నదని !"

వెనక బెంచీలలో కూచున్నవారు ఎవరో అంటున్నారు. "అదుగో ! ఆ మూల కూచుందే, ఆ ఎర్ర అమ్మాయి, జడలో గులాబి పువ్వులు పెట్టుకుంది, ఆ అమ్మాయి అన్నమాట, ఈ నాటకంలో అహల్య పాత్ర వేయవలసి ఉంది. కానీ ఎందుకనో మానుకొంది. వేసిఉంటేనా, నాసామిరంగ ఎంత బాగా ఉండేదో నాటకం ...."

ప్రసన్న తల వెనక్కు తిప్పి ఆమాట అన్నవాళ్లను చూడడం కోసం ప్రయత్నించడం, కానీ ఇంతలో లైట్లు ఆరిపోవడంతో ఆ ప్రయత్నం నెరవేరలేదు. రంగస్థలంమీది నుంచి సన్నసన్నగా సంగీతం మొదలైంది.

తనకేమీ తెలీ దన్నట్లుగా అడిగాడు, కరుణ వైపుకు వంగి, "నిజమేనా ?"

కరుణ భయం భయంగాఅన్నది. "ఊఁ!"

"అయితే ఎందుకు వెయ్యలేదు ?"

"వెయ్యకూడదు అనుకున్నాను."

"ఓహో !" ఆ స్వరం అంతకుముందు ప్రసన్న అనగా ఎన్నడూ విన్నది కాదు. కరుణ తలఎత్తి అతనివేపు చూసింది. ప్రసన్న తల మరో వైపుకు తిప్పుకుని కనిపించాడు.

రంగస్థలంమీద ఇంద్రుడు, అహల్యకై పడుతున్న విరహవేదన, ఆమెను పరమ పతివ్రతగా గుర్తెరిగి తాను పొందలేనని నిరాశ పడటం, అంతలో తన పురుషకారంమీద తనే విశ్వాసం ప్రకటించడం, స్వగతాలుగా, పరమ రమణీయంగా మన్మథ నటిస్తున్నాడు.

(సశేషం)

# చెల్లాయికి ప్రేమతో... 4

'పి. ఎస్.'

చెల్లీ,

నువ్వు వ్రాసిన లేఖ అందింది. మీరంతా కులాసాగా వున్నందుకు చాలా సంతోషం. ఈరోజుల్లో ప్రతివస్తువుకీ ధరలు పెరిగిపోయాయనీ, ఎంత డబ్బు వచ్చినా చాలడం లేదనీ, ఖర్చు తగ్గించేటందుకు ఏదైనా ఉపాయం చెప్పమనీ వ్రాశావు. నేనూ అదే అవస్థలో వున్నాను చిట్టితల్లీ. ఎక్కడ విన్నా "పొదుపు చెయ్యండి" అనే నినాదమే వినిపిస్తోంది ఈరోజుల్లో. మనం ఎంత పొదుపు చేయాలని ప్రయత్నించినా ధరలు పెరగడం వలన డబ్బు మిగలడం అంటూ వుండడంలేదు. అసలు కొద్దికొద్ది జీతాలు వచ్చేవాళ్ల బాధలు ఏమని వర్ణించాలో తెలీదు. ఆకలి కవులకి మంచి కథావస్తువు అది. కనీసావసరాలకి కూడా డబ్బు చాలడం లేదు వాళ్లకి. పాల ధర పెరిగింది. అసలు కొన్నిచోట్ల పాలు దొరకడమే కష్టంగా వుంది. పాల కార్డూ, డబ్బులూ, గిన్నే పుచ్చుకుని గంటన్నర క్యూలో నిలబడితే కొంచెం మంచి పాలు దొరుకుతాయి. ఇలాంటి క్లిష్ట సమయంలో ప్రతివారూ దుబారా అనేది మానివేయడం నువ్వు చెప్పినట్లు చాలా అవసరం. పెద్దగాస్నుతో యిస్తే గానీ పాలు త్రాగనని మొండికెత్తి కూర్చుంటాడు మాపక్కింటి వాళ్ల బాబు. వాళ్లమ్మకి వాడొక్కడే కొడుకు. అడిగినన్ని పాలూ యిస్తుందావిడ. సగం త్రాగి, మిగిలినవి తూములో పారబోస్తాడు వాడు. ఆ పాలు దొరకక ఎంతమంది పాపలు అల్లాడుతున్నారో అన్న విషయం ఆవిడకి అర్థంకాదు. ఇలాగే మన ఇళ్లల్లో అనేక విధాలుగా దుబారా అయిపోతూ వుంటుంది. చుట్టాలు వస్తారంటే ముందే వంట చేసి పెట్టుకోడం, వాళ్లు రాకపోతే అదంతా వేస్ట్ కావడం. వాళ్లు వచ్చాక చేసుకోవచ్చులే అనుకుంటే పేచీలేదు. బియ్యం దొరకడం కష్టం. పాలు దొరకడం కష్టం. కల్తీలేని నెయ్యి అసలు లేనేలేదు. అటువంటి ఈ రోజుల్లో చుట్టాల కోసం వండి వుంచడం వివేకం కాదనుకుంటా. పూర్వంలా ఇప్పుడు వంట చేయడానికి ఎక్కువ సమయం అవసరంలేదు. స్టౌల మీద త్వరగా అయిపోతుంది కదా! అలాగే సినిమాలు చూడడం, చూసినవే చూడడం, స్నేహితులతో ఒకసారి చుట్టాలతో ఒకసారి, మనకి మనం ఒకసారి. ఒకే సినిమా అన్నిమార్లు చూడడం ఎందుకు చెప్పూ. కొంతమందికి చూసిన వస్తువు వెంటనే కొనడం అలవాటుంటుంది. ఈ వస్తువు ఈనెలలో మనం కొనగలమా అని ఆలోచించరు. కొంతమంది బట్టలు కూడా అలాగే కొంటారు. వచ్చిన కొత్త నమూనా చీర వెంటనే కొనకపోతే తోచదు కొంతమందికి. కొన్న చీరెలన్నీ బీరువాలో దాయడమేకానీ ఎక్కువగా ఉపయోగపడవు. ఎప్పుడో 'అకేషన్' వస్తే తప్ప. విలువైన నగలైనా అంతేకదా! ఖర్చు తగ్గించడం ఎలా అన్నావు కదూ! ఆసంగతి వదిలి ఏమిటో వ్రాస్తున్నాను.

ప్రతినెలా మీకొచ్చే ఆదాయానికి తగ్గట్టు మీ బడ్జెటు వేసుకో. ఒక్కొక్క అంశానికీ కొంత డబ్బు కేటాయించు...ఇంటి అద్దె, కరెంట్ బిల్లు వంటివి ప్రతినెలా ఒకటిగానే వుంటాయి గానీ ఇతర ఖర్చులు నెలనెలకీ మారుతూ వుంటాయి కదా. ఒక పుస్తకం తీసుకుని ఏరోజు ఖర్చు ఆరోజు వ్రాయి. ఏవస్తువు కొన్నా దాని తాలూకు బిల్లు ఒక్కటి కూడా పారేయకు. అన్నీదాచు. నెలాఖరుకి దేని కెంతైందీ కూడి చూసుకో. నువ్వు వేసుకున్న అంచనా కన్న ఎక్కువ దేనికైందీ, దేని కోసం ఎక్కువ ఖర్చైందీ తప్పకుండా తెలిసిపోతుంది. ఆఖర్చు తగ్గించడానికి ప్రయత్నించు. ఉదాహరణకి వినోదానికి పదిహేను రూపాయలు వేశావు.. ఇరవై అయింది. ఆ అయిదూ వచ్చే నెలలో కాకుండా చూడు. అలాగే బట్టలు ఇస్త్రీ చేయించడానికి నువ్వు కేటాయించిన దానికన్న ఎక్కువ ఖర్చైతే, దాన్ని కూడా, తగ్గించు. ఖర్చు తగ్గించడానికి ఇంతకన్న వేరే మార్గం ఏముంటుంది. అయితే "నా బడ్జెటు ఎప్పుడూ లోటు బడ్జెటే!" అని నవ్వి వూరుకోకూడదు. పిల్లలు పెద్దవుతూన్న కొద్దీ వాళ్ల స్కూలు ఫీజులు, పుస్తకాలు, ఒకటేమిటి, అనేక ఖర్చులు ఎదురవుతాయి. వాటిని ఎదుర్కోడానికి ఇప్పటి నుంచే సిద్ధపడాలి. అంటే బడ్జెటులో నిల్వ క్రింద ప్రతినెలా వున్నదాంట్లోనే కొంత మొత్తం, ఎంత తక్కువైనా సరే, కేటాయించాలి. ఏవస్తువు కొన్నా దాని ఉపయోగాన్ని ఆలోచించి మరీ కొనాలి. ప్రక్కవాళ్లు కొన్నారని కొనకూడదు. బట్టలు కూడా ఒక పద్ధతి ప్రకారం, ఒక నియమం ప్రకారం కొనాలి గానీ వెర్రిగా కాదు. చందాలు, విరాళాలు, దానాలు, ధర్మాలు కూడా ఒక పద్ధతిగా చేయాలి. అప్పుడే ఆర్థిక పరిస్థితి కుంటుపడకుండా వుంటుంది. ఆకస్మాత్తుగా జబ్బులు, చుట్టాలు, ప్రయాణాలు వస్తూంటాయి. వాటి కోసం అప్పుకు బయలుదేరే స్థితి రాకుండా ప్రతినెలా మిగల్చాలని నేననేది. పండగలు వస్తే విపరీతంగా ఖర్చు చేయడం, చుట్టాలొస్తే వాళ్లకోసం అప్పుతెచ్చి వేలంవెర్రిగా మర్యాదలు చెయ్యడం ఇవన్నీ తగ్గించాలి. ఏఖర్చు చేసినా మన ఆర్థిక స్థితికి తగ్గట్టు, నిరాడంబరంగా చేయాలి. అప్పుడే ఖర్చు తగ్గించడానికీ, ఉన్నదాంట్లో కొంచెమైనా మిగల్చడానికీ వీలుంటుంది. డబ్బు నిర్లక్ష్యం చెయ్యతగ్గది కాదమ్మా. నన్ను "మెటీరియలిస్టిక్" అని నువ్వు అంటావేమో తెలీదు గానీ, డబ్బు మనిషికి కాలూ చెయ్యీ వంటిదని ఒక రచయిత అభివర్ణించాడు. డబ్బు తప్ప మరేమీ లక్ష్యం చేయకపోవడం అవివేకం ఎలా అవుతుందో డబ్బును నిర్లక్ష్యం చేయడం కూడా అంతే అవివేకం. అంచేత డబ్బును జాగ్రత్తగా వాడాలి అందులోనూ ఈ అత్యవసర పరిస్థితిలో మరీ జాగ్రత్తగా వాడి మనకున్న దాంట్లోనే రక్షణ నిధికి విరాళం యివ్వగలగాలి. త్వరగా జవాబు వ్రాస్తావు కదూ?

మీ అక్కయ్య

# భామ అదృష్టం

లతిక



సినిమా ప్రోగ్రాం వేసుకున్నాం, నేనూ, మావారూ, భామా దాని మొగుడూ! భామ నాకు చెల్లెలవుతుంది. అతను (భామ మొగుడు) మావారి ఆప్తమిత్రులు. అతన్ని తంబీ అని పిలుస్తారాయన. భామని పెళ్లి చేసుకున్నాక నాకు మరీ సన్నిహితుడయేడు. అదివరకు 'మీరు' అని మన్నించే దాన్నతన్ని. ఇప్పుడు మరిదీ అని పిలవడం అలవాటయింది.

వాళ్ల పెళ్లి వార్షికోత్సవమని, ఆవేళ సినిమా ప్రోగ్రాం ప్రపోజ్ చేసేడు మరిది. వాళ్లొస్తారని యెదురు చూస్తున్నాం. తీరా వాళ్లు రావడాని కింత ఆలస్య మెందుకైందో!

అదును దొరికితే చాలు, ఆడవాళ్ల సుదీర్ఘ—అలంకరణని విమర్శనచేసే మా ఆయన ప్రారంభించేరు:

"మరదలుపిల్లా, నువ్వూ ముస్తాబు పూర్తి చేసుకునేసరికి సెకండ్ షోకి వేళవుతుంది." తల దువ్వుకుంటూనే వ్యాఖ్యానించే రాయన.

"మమ్మల్ననడ మెందుకూ! మీరు వెలగబెడుతున్న రాచకార్య మేవిటి యిందాకట్నుంచీ? ఆ దువ్వుకోడాని కంతూ వంతూ ఉందా? మీకున్న రెండాకు లెక్కవే చదివేడా మరిది. రానివ్వండడుగుతాను. ఏవయ్యా! పెద్దమనిషి! సినిమాకి తీసుకెళ్తానని చెప్పిన నీకోసం యింతసేపు పడిగాపులు పడాలా అంటూ!"

నా మాటలు పూర్తికాకుండానే కాల్బెల్లు మోగింది. రిక్షా ఆగిన చప్పుడు వినిపించింది. భామా మరిదీ వచ్చేరనుకుని వీధి వేపు చూదును గదా, ఖాళీ రిక్షా కనిపించింది.

"ఏరా! చినబాబూ వాళ్ళూ యేరీ?" ఆయన ప్రశ్న.

"చినబాబు ఫ్రెండ్సు యీ ఇండిలో ఉంటున్నారట. అళ్లతో మాటాడాలని ఆపేసి వెళ్లేరు బాబూ. మిమ్మల్ని సినిమా వెళ్లమన్నారు." రిక్షావాడి సమాధానం.

ఆయన నావేపు చూసేరు, 'వెళ్దామా?' అన్నట్టు.

"ఏం బాబూ! వస్తారా?" రిక్షావాడు

తొందరపడుతున్నాడు.

"ఊహుఁ సినిమాకి రాం. పార్కుకి వెళ్తాం. పడిచే వెళ్తాం. మువ్వేళ్లు."

బిల్లు మోగించుకుంటూ రిక్షా వెళ్లింది.

"అదేం లతా! పోనీ మనం వెళ్ల డానికేం ?"

"నాకేం చూడాలని లేదు. మీ తమ్ముడుం గారూ, మా భామా వస్తారని బయల్దేరా వంతే. పాహాస్త్వలేని ఆతిథ్యంలా మనమే వెళ్లడం నాకు నచ్చదు. వెళితే అందరం కలిసే వెళ్లాలి."

"అయితే పార్కుకెళ్దామా ?"

"ఏం యీసారి మీరు అప్‌సెట్ చేస్తారా? క్షణక్షణముల్ మగవాండ్ర చిత్తముల్."

"ఆడది విజృంభిస్తే మగాడు మాట్లాడ్డానికి సాహసించలేడు."

"అవును పాపం! అందునా మీరు మరీని! వస్తారా ? ఉండిపోదామా ?"

"లేదు లేదు. పద."

తీవ్రమైన ఆలోచన మనిషిని మాటాడ నివ్వదు. అనుకున్నది కాకపోతే నాకు గొప్ప చికాకు. మాటాడకుండా నడుస్తున్నాను నేను. ఆయన మాత్రం యేదో చెబుతునే ఉన్నారు. వింటూ, ఆలోచిస్తూ, నడుస్తున్నాను నేను.

"ఏం లతా! ఇదంతా మరిది మీద కోపమేనా ?"

"కాదు. మీ మీదే!"

"అదేమిటే ? గాలి నా మీదికి తిరిగిందీ సారి ? మధ్యన నేనేం చేసేను ?"

"ఏం చేశావని అడుగుతారేం ? మీరు చేసినదే యిదంతా !"

"ఇది మరీ బాగుంది. సినిమాకి రావద్దూ ఉండిపో అని నేను చెప్పానా ?"

"చెప్పినట్టే."

"అంటే ?"

"అంటే, యింటి దగ్గర పెళ్లామూ, ఇక్కడ మనమూ, తనతో సినిమాకి వెళ్లడానికి యెదురు చూస్తుంటే యిందర్ని కాదని—యెవరో ట్రైన్లో వస్తున్నారని స్టేషనుకి వెళడం బాగుందా ?"

"బాగుంది లతా! ఎంతో అవసరం లేనిదీ—అతను మాత్రం ప్రోగ్రాం ఎందుకు మానుకుంటాడు ?"

"అదే మీరు చేస్తున్న తప్పు. అతనికి తెలీకపోతే మీరు చెప్పాలి. వస్తానని చెప్పి, మానేయడం అతని కిదేం కొత్త కాదు. అయినా మీ రతన్ని నమ్మడమే చిత్రం. మీ రిలా అతన్ని సమర్థించబట్టే...."

"ఎవ్వ పొరపాటు పడుతున్నావ్ లతా! ట్రెయిన్లో వెళ్తున్నది యెవరో యేమో?"

"ఎవరైనా—భార్య కంటె కూడా చాలా యెక్కువ వాళ్లు. అది మాత్రం నిజం."

"మరదలు కూడా నీ అంత ఘాటుగా ఆలోచిస్తే తంబి చాలా యిబ్బంది పడతాడు."

"అదో వెర్రి మాలోకం. అదలా పట్టించుకోక పోబట్టే మీ ఆటలు సాగుతున్నాయి."

పార్కు చేరేం. నా కళ్లని నేనే నమ్మలేక పోయాను.

"మా అందరిలోకీ పవిత్రమైనవాడు తంబి ఒకడే" అని ఆయన తరచు కీర్తించే వ్యక్తి—పార్కులో నిర్జనంగా ఉన్న ఒక కార్నర్‌లో మరొక అమ్మాయితో నవ్వుతూ కబుర్లు చెబుతున్నాడు. ఆ అమ్మాయి భామ కాదు.

ఆయన వాళ్లని చూడలేదు. మాకు కొంత దూరంలో ఎవరో కనబడితే అతనితో మాట్లాడుతున్నారు. స్పీకర్‌లోంచి పాట వినిపిస్తోంది.

"నా ప్రేయసి సన్నిధియే స్వర్గమూ నా జీవిత గమ్యానికి మార్గమూ." అంటూ, ఈ పాట మరిదికి చాలాయిష్టం. వందలసార్లు విన్నా ఈ పాట తనకి విసుగనిపించదంటూ ఉంటాడు. ఆ పాట వినిపిస్తే చాలు. "అదిగో నా పాట" అంటూ గోల చేస్తాడు.

నా ఆలోచనలు పాట నుంచి మళ్లేయి. అతని ప్రవర్తన గురించి ఆలోచించ సాగేను. ఎంత తెలివైన వ్యూహం, స్టేషనుకి వెళ్తున్నానని భార్యకి చెప్పి— మమ్మల్ని సినిమాకి వెళ్లమని రిక్షావాడి చేత కబురు పెట్టడంలోని అంతర్యమిదా ? మేము సినిమాకి వెళ్తామనుకుని తా నిక్కడ మరో ఆడదానితో ....

ఛీఛీ!—తప్పుదారిన పడిన మగాళ్ళు తమ తప్పు, అయిన వాళ్లకి తెలీకుండా ఉండ డాని కెన్ని నాటకా లాడతారు ?

పెళ్లయి ఏడాదే అయింది. పెద్దలు చేసిన బలవంతపు పెళ్లి కాదు. తనకు తానై మనసుపడి చేసుకున్నాడు. పెళ్లి కాకముందు భామ కోసం యెంతని తపించేడు ? ఇంతలో ఇంత మార్పా? లభించని పది—లభించగానే—ఆ మోజు తీరిపోతుందా?

ఏణ్ణర్థం కిందట బంధువులింట్లో పెళ్లికని బయల్దేరుతూ, ఇతణ్ణీ కూడా మాతో తీసుకెళ్లాం. నవ్వుతూ, సరదాగా కబుర్లు చెబుతూ, నవ్విస్తూ హుషారుగా ఉంటాడని. పెళ్లిలో భామని చూసేడు.

పెళ్లివారికి పన్నీరు జల్లుతూ, గంధం రాస్తూ, హారతి పాటలు పాడుతూ భామ కనిపిస్తే, అతని కళ్లలో ఎంత ఆరాధన?

తనని జీవితంలో, తన సాన్నిధ్యం పెన్నిధిగా భావించే వ్యక్తి భర్తగా లభించడం కంటె స్త్రీకి అదృష్ట మేముంది ? భామ అదృష్టాన్ని అభినందించేను. భామ యితనితో సర్వ సౌఖ్యాలూ అనుభవిస్తుం దని ఆశించేను.

అతని కోరిక—మా ప్రోద్బలం—భామ యిష్టపడడం — పెద్దల అంగీకారం, అన్నీ వాళ్లిద్దర్నీ వధూవరులని చేసేయి.

స్త్రీ—తనది కాకముందు—అయినంత వరకూ పురుషుడు ప్రదర్శించే తపన — ఆ స్త్రీ, భార్య కాగానే క్షీణిస్తుందా ? ప్రేయసిగా ఆరాధన అందుకున్న స్త్రీ— భార్యగా ఆ ఆరాధన అందుకోలేదా ?

ఒకనాడు భామ కోసం పడిన తపన—యీనాడు మరో అమ్మాయి కోసమా! ఛీ—ఇలాటి వ్యక్తిని మరిదీ అని యెలా పిలవగలిగాను ?

ఇక అక్కడ ఉండి, భామకి జరుగుతున్న అన్యాయం చూడలేకపోయాను. ఇంటికి బయల్దేరాం. నేను చూసిన ఘోరం ఆయనకి చూపించలేదు. ఆయనతో ఆ విషయం చర్చించదలుచుకోలేదు. తన తమ్ముణ్ణికన్న మిన్నగా, ఆత్మీయునిగా చూసుకునే స్నేహితుడు తప్పు చేస్తాడని ఆయన అంగీకరించరు. అతని ప్రవర్త

గురించి ఆయన కంత నమ్మకం. ఆ నమ్మ కవు ముసుగు అడ్డు పెట్టుకుని— తప్పుల చేస్తూ కూడా మంచివాడిలా చెలామణి అవుతున్నా డతను.

తప్పు చేసేవాళ్ళు—తమని పరిశీలనగా గమనించేవాళ్ల దగ్గర జాగ్రత్తగా వడుచు కుంటారు. నే నతన్ని అనుమానించినట్లు అతనికి తెలియకూడదు. నేర్పుగా మాటల్లో మభ్యపెట్టి నేరస్తునిచే నిజం చెప్పించాలి. మళ్లీ మళ్లీ ఆ తప్పు చెయ్యకుండా చూడాలి.

భామకోసం నేనీ నిర్ణయం తీసు కున్నాను.

* * *

ఆఫీసుకి వెళ్తూ మరిది మా యింటికి రావడం—కాసేపు అవీ యివీ మాట్లాడుకుని యిద్దరూ కలిసి ఆఫీసుకి వెళ్లడం, వాళ్ల అలవాటు.

యధాప్రకారం మర్నాడు అతను వచ్చేడు. నవ్వుతూ పలకరించేడు. ఆ నవ్వులో కల్మషం లేదు. ఎదుటివాళ్లని మభ్యపెట్టే వంచన లేదు. నిష్కల్మష హృదయంతో మన సారా నవ్వుతూ మాటాడే వ్యక్తిలా కనిపిం చేడు.

నిన్న కలవరపరచిన సంఘటన కల కాదు కదా అన్న అనుమానం కలిగిందా నవ్వు చూస్తే !

"మరిదీ! మమ్మల్ని మరిచిపోయే వను కున్నాను."

"మరిచిపోతే—యీవా లిక్కడి కెలా రాగలను ?"

"అయితే నిన్న మరిచిపోయావన్న మాట కట్టుకున్న భార్యని—కావాలను కున్న అన్న వదినల్ని—వివాహ వార్షికోత్స వపు మధురానుభూతినీ—మరపింపజేసిన మహాత్ము లెవరో ! వారి అడుగుజాడల లోనే ప్రయాణం సాగించక పోయేవా ? మళ్లీ దారితప్పి యీ సామాన్యుల సహ వాసం యింకెందుకు ?"

"అదేవిటి మరీ అంత నిష్ఠురంగా ఆడి పోస్తున్నావ్ ?" అని నన్ను వారిస్తూ

"మరేం అనుకోకు తంబీ ! లత ధోరణి నీకు తెలియని దేముంది ?" అంటూ సమా

# భామ అదృష్టం

ధాన వరుస్తున్నా రాయన

"అనుకోడాని కేముంది ? అలా నిల దీసి అడిగే అధికారం వహించగలవారు, వదినగారు తప్ప నా కెవరున్నారు ?"

"అడగడమూ, అనడమే మిగులు. నీ బుద్ధులు మాత్రం నువ్వు మానవు. ఇంతకీ నిన్న విజయం చేసిన...."

"ప్రసాదరావుగారని, హైస్కూల్లో చదివేటప్పుడు మా క్లాస్‌మేట్. ప్రస్తు తము కలకత్తాలో ఉంటునారు. స్కూలు విడిచిపెట్టిన యిన్నాళ్ల కిదే మళ్లీ మేం కలుసుకోడం. నే నిక్కడుంటున్నట్టు యీమధ్యనే తెలిసిందట. తనూ, మిసెస్సూ ట్రెయిన్లో వెళ్తూ కలుసుకోమని టెలిగ్రా మిచ్చాడు."

ఆ మాటలు అబద్ధాలు కావు. అబద్ధా లాడేవాళ్లకి ఎదుటివాళ్లు తమ మాటలు నమ్ముతున్నారా లేదా అన్న సంకోచం ఉంటుంది. ఆ ధోరణి యితనిలో అణు మాత్రమైనా లేదు.

నే నతన్ని అనుమానించిన మాటా నిజమే అయినా, అబద్ధాన్ని నిజంగా చెప్పే ప్రావీణ్యత అతనికి ఉందని—నేను సైతం అంగీకరించను.

ఈ డొంక తిరుగుళ్లన్నీ మానేసి భామనే అడిగితే? కాని అది మరికొన్ని ప్రమాదాలకి దారితీస్తుంది. నిజా నిజాలు తెలీకుండా యీ సంగతులు దానితో ప్రస్తావిస్తే— నిష్కారణంగా, దాని మనశ్శాంతి పాడుచేసిన దాన్నవుతాను. అందుకని ఆ ప్రయత్నం విర మించుకున్నాను.

ఇక మిగిలిం దొక్కటే. రేడియోలోపాట. ఆ ప్రసక్తి మళ్లీ ఎప్పుడేనా తీసుకురావాలి. మరికొన్నాళ్లు నిరీక్షించడానికే నిశ్చయించు కున్నాను. వారం రోజులు గడిచేయి.

* * *

పండగలొస్తే—మరిదినీ, భామనీ మా యింటికి పిలవడమో—వాళ్లు మమ్మల్ని ఆహ్వానించడమో మామూలు.

ఉగాదికి మా యింటికే పిలిచేం. మధ్యా హ్నం భోజనాలయేయి. సాయంత్రం సిని

మాకి వెళ్దామన్నాడు మరిది. భామా, మా ఆయనా అంగీకరించేరు. నేనుమాత్రంవూరు కున్నాను. ముగ్గురూ ప్రశ్నలు ప్రారంభిం చేరు.

"వదినగారేదో ప్రణాళికలు వేస్తున్న ట్లుంది"

"ఏవక్కా వెళ్దామా?"

"ఏం లతా! మౌనం అర్ధాంగీకారమని భావించవచ్చా?"

ముగ్గురి ప్రశ్నలకీ సమాధానం చెప్పేను.

"ఈవాళవెళ్దాం. కాని యిప్పుడు కాదు"

మరిది మళ్లీ తన మామూలు ధోరణిలో నవ్వుతూ అడిగేడు. "అదేవిటండోయ్! ముహూర్తం గట్టా పెట్టేస్తారా?"

"అదే ఆలోచిస్తున్నాను. మళ్లీ—ట్రెయి న్లోవెళ్లే స్నేహితులెవరూ అడ్డు తగలకుండా తిరుగులేని ముహూర్తం పెట్టేద్దామని! ఏవే భామా!"

"అడ్డు తగలడమే మంచిదక్కా!" భామ సమాధానం.

"అదేవిటే! నన్నుకాదని మీ ఆయన్ని సపోర్ట్ చేస్తున్నావ్! మరిది మాటలువింటే నీకేం లాభం? ప్రోగ్రాములు వాయిదా పడడం తప్ప"

"పడితేనేవక్కా! మంచి ప్రెజెంటేషన్సు దొరికాయి"

"ఎవరికి—మరిదికా?"

"ఇద్దరికినీ. ఈ గాజులూ, ఆయన కట్టుకున్న నెక్‌టై—ట్రెయిన్లో కలిసిన దంపతుల బహుమానాలే!"

భామ చేతిగాజులూ, మరిది కట్టుకున్న టై, అతను స్టేషనుకి వెళ్లేడని ఋజువు చేస్తునేవున్నాయి. మరి పార్కులో నేను చూసింది? పార్కులో కొంచెంసేపు గడిపి, ట్రెయినుకి వెళ్లివుంటాడా? అదే అయితే పాట ప్రసక్తి తెచ్చి నిజం రాబట్టవచ్చు.

మౌనంగా నా ఆలోచనలు సాగుతున్నాయి. కాని నన్ను వాళ్లు ముగ్గురూ వూరుకో నిస్తేగా?

"లతాదేవీ! నీకు అలాటివి కొనిపెట్టనా" శ్రీవారు ఆఫర్ చేస్తున్నారు.

"ఏవక్కా! ఈగాజులు నీకు నచ్చలేదా?" భామ సందేహం.

"ఏవండీ వదినా! ఈ పాట మీకు నచ్చలేదా?" భామని అనుకరిస్తూ మరిది వెక్కిరింపు.

రేడియో ట్యూన చేశా రాయన సన్నగా ఏదో సినిమాపాట వినిపిస్తోంది.

"శ్రోతలు కోరిన పాటలు వస్తున్నాయి.

# భామ అదృష్టం

ఆడవాళ్ళూరుకుంటే వినిపిస్తాయి" మరిది వ్యంగ్యం.

"గోల చేస్తున్నది—మగవారే" భామ జవాబు.

"ఏం మరిదీ! నీ ప్రియతమగీతం—మార్గమూ స్వర్గమూ పాట ప్రసారం చెయ్యమని కోరేవా?"

"అవునండీ! విని చాలా కాలమయింది."

"అదేవిటి? కిందటివారమేగా ప్రసారం చేశారా పాట!"

"ఎప్పుడు?"

"ఎప్పుడేవిటీ! నువ్వు మన సినిమా ప్రోగ్రాంమిస్‌చేసిననాడే సినిమాకి వెళ్లకుండా పార్కుకివెళ్ళే అక్కడ వినిపించిందీపాట!"

"అరెరే! మన ప్రోగ్రాంతోపాటు—నా పాట కూడా మిస్సయా నన్నమాట.",

మాట చమత్కారంగావున్నా, తనా పాట వినలేకపోయానన్న నిరాశ అతనిలో స్పష్టంగా కనిపిస్తోంది.

పార్కులో నేను చూసినది లతనే అయితే నా మాటలకి నిర్ఘాంతపోయి ఉండేవాడు. ఏదో పొరపాటు జరిగింది. అన్యాయంగా యితని ప్రవర్తన అనుమానించి పాపం చుట్టుకున్నానని ఘోషించింది అంతరాత్మ.

భోజనాలుచేసి, సెకండ్ షోకి వెళ్ళాం. పండగ కావడంచేత థియేటర్లో చాలా రద్దీగా వుంది. నలుగురం ఒకచోట కలిసి కూచుందికి చోటు దొరకలేదు. వాళ్ళో దగ్గరా, మేమో దగ్గర కూచోవలసి వచ్చింది.

ఆట ప్రారంభమైంది. ఇంటర్వెల్లో హాలంతా కలియజూసేను. మావెనక వరసలో కూచున్న మరిది, మాముందు కనిపించేడు. అతనివక్కన భామలేదు పార్కులో చూసిన అమ్మాయి కనిపించింది ఆశ్చర్యంతో వెనక్కు తిరిగిచూసేను. భామతో నవ్వుతూ కబుర్లు చెబుతున్నాడు మరిది.

"మా అందరిలోకీ పవిత్రమైనవాడు తంబి ఒకడే" అన్న శ్రీవారి మాటలు అంతరాంతరాలలో ప్రతిధ్వనించేయి.

అన్య స్త్రీలపట్ల ఆకర్షణ, పురుషుడు నిగ్రహించుకోలేని బలహీనత ఆ బలహీనత విషయంలో పురుషులంతా ఒకటేనన్న—నమ్మకపు రంగుటద్దాలలోంచి పురుష ప్రపంచమంతా ఒకేలా కనిపించిందిన్నాళ్ళూ. కాని అందరూ అలాటివాళ్లుకారు మరిది లాటి మంచివాళ్ళూవున్నారు. భామ అదృష్టవంతురాలు! ●

గాబ్రియర్

# హాలీవుడ్ ప్రణయాలు

నన్నే దొంగలెత్తుకుపోయి, సొమ్ము చెల్లించకపోతే విడిపించమని దొంగలు బెదిరిస్తే మా కుటుంబంవాళ్ళు వదిలించగల శక్తి కలవారుకాదు. అసలు నా విలువెంత? కాని అంతపనీ ఒకసారి జరిగింది. అంటే నన్ను 'ఎత్తుకు'పోయారొకసారి!

నన్ను ఎత్తుకుపోయిన 'దొంగ' ఫ్రాంక్ సినాత్రా. ఇది మీరు నమ్మలేని కథంటారు. నిజానికి ఇది హాలీవుడ్ తారలు తమ కోరికల్ని తీర్చుకొనటానికి ఎంతదూరం వెడ్తారో రుజువుచేసే సంఘటన.

ఈ తారల జీవితాలు కొంచెం అద్భుతంగానే ఉంటాయి. లోయలలో, కొండ చరియలమీద, అగాధాల అంచుల పక్కన ఇళ్ళు కడ్తారు. ఇవి ఇళ్ళే కాదు. భవనాలు. చూట్టానికి భవనాలలాగ కనిపించకపోయినా వాటిలోపల ఏర్పరచిన సౌకర్యాలనిబట్టి వాటిని అలాగే వర్ణించాలి—ఈతకొలనులు, స్నానాలగదులూ, పరిచార చారికాదళాలూ కల ఇవి రాజభవనాలు!

ఫ్రాంక్ సినాత్రా, బింగ్‌క్రాస్‌బీ, జిమ్మీవాన్, హెూసెన్‌లు ఒక విమానాన్ని కలిసి వాడుకుంటారు. ఇది కేవలం వేళా సౌకర్యంకోసమే. హూసెన్ ఇంటో, విమానాశ్రయంలోఉండే యంత్రసామగ్రి కల గది ఒకటి ఉంటుంది అవసరమయితే, ఆరాత్రి పెద్ద తుఫాను రావచ్చునని వాటిచేత చెప్పిస్తాడు అతను; అందులోనూ అందమయిన అతిథి ఎవరయినా విమానంమీద తిరిగి వెళ్ళిపోదామని తొందరపడుతూ వుంటే...

సినాత్రా ఇల్లు చిన్నదిగా ఉన్నా, అన్ని సౌకర్యాలూ ఉంటాయి. అతనికి ఇద్దరు మాల్టా దేశంనుంచి వచ్చిన నౌకరు ఉన్నారు. వాళు నిశ్శబ్దంగా, ఇంట్లో తిరుగుతూ వుంటే ఏదో భయంవేసేది నాకు! వీరి విశ్వాసం ఇంతా అంతా కాదు. యజమాని కోసం ఏదయినా చేస్తారు.

ఒక కథ చెప్తాను. నేనప్పుడు న్యూయార్క్‌లో ఉండేదాన్ని. నన్ను హాలీవుడ్‌కి రమ్మని పిలిచాడు ఫ్రాంక్. పిలవటమేకాదు చంపుకుతిన్నాడుకూడా. అతని బాధ పడలేక సరేనని ఒప్పుకునే, చల్లగా పారిస్‌కి వెళ్ళిపోయాను. పారిస్‌లో నా చిన్నకొడుకూ, తల్లీ ఉన్నారు. వారిని చూడాలనిపించింది హఠాత్తుగా.

పారిస్ వెళ్ళిన వారం రోజుల తర్వాత హాలీవుడ్‌నుంచి టెలిఫోన్ వచ్చింది. "ఫ్రెంచి బొమ్మా! వెంటనే ఇక్కడికి రా. నీకు మంచి సినిమా పాత్ర ఒకటి ఇప్పిస్తా! షూటింగ్ చాలావరకూ ఫ్రెంచి రివియరాలో జరుగుతుంది" అని వత్తిడి చేశాడు ఫ్రాంక్ సినాత్రా. "నీకు విమానం టికెట్ ఒకటి పంపుతున్నాము."

ఈ కట్టుకథతో నన్ను మోసం చేశాననుకున్నాడు పాపం ఫ్రాంక్! అతని సినిమా గురించి నేను వినకపోలేదు. ఆ సినిమా నాయిక నీగ్రో అంశం ఉన్న ఒక 18 సంవత్సరాల కన్య. నేను 18 సంవత్సరాలకే అంతకన్నా ఎదిగినట్లు కనిపించేదాన్ని. ఇక నీగ్రో అంశం అంటారా, నాబంగారు జుట్టూ, నీలంకళ్ళూ ఈ పాత్రకి ఏం సరిపోతాయి? కాని ఫ్రాంక్‌ని ఏడిపిద్దామని నమ్మినట్లే నటించాను. అంతేకాక, ఏ మహత్యంతో ఏమి జరగవచ్చో, నాకు నిజంగా ఎటువంటి భవిష్యత్తు ఉందో అని అమెరికాకి బయలుదేరాను.

నాకు విమానాశ్రయంలో ఘనస్వాగతం లభించింది! ఫ్రాంక్ ఇంటికి వెళ్ళిపోయాము. మూడురోజులు ఒకటేపార్టీలు. నేను ఎప్పుడు సినిమాలో నా పాత్ర గురించి ప్రస్తావించినా ఫ్రాంక్ ఏదో చల్లని కబుర్లు చెప్పి తప్పించేవాడు.

నాల్గవరోజున తెల్లవారి మేల్కొన్నాను. ఇంట్లో నేను తప్ప ఎవరూలేరు! (ఇద్దరు మాల్టాదేశం నౌకరు తప్పించే అనుకోండి). "అయ్యగారు తిరిగివచ్చేదాకా ఇక్కడే ఉండమన్నారు" అన్నారు. ఒక చిన్న చీటీ ఇచ్చారు.

"నాకు చెప్పకుండా పారిస్ వెళ్ళిపోయినందుకు శిక్ష—ఫ్రాంకీ" అనిఉంది. దానిలో. వళ్ళు మండింది. టెలిఫోన్‌వద్దకి పరిగెత్తాను. కనెక్షన్ తీసేసి ఉంది. కారు షెడ్డులోకి వెళ్ళాను. నౌకర్లకోసం ఉంచిన 'స్టేషన్ వాగన్' ఒకటే ఉంది. దాని తాళంచెవులు లేవు. నడిచి వెళ్ళిపోతానని వాళ్లతో అన్నాను. 'ఇక్కడనుంచి కదలకుండా చూడమని చెప్పా'రన్నారు. వారి వాలకంచూస్తే భయంవేసి అంతటితో వూరుకున్నాను. కొంతసేపటికి ఈ పరిస్థితి నిజంగా చిత్రంగానే ఉందనిపించింది. ఒక పెద్ద హాలీవుడ్ నటుడు నన్ను చెరలో వేశాడు. నేను నాయికనీ, అతను దుష్టుడూ—లేదా నాయకుడూ. ఇదీ ఒక ఫిలిం కథలాగే ఉందే! నేను తప్పించుకుని చేసేదేముంది?

మాల్టీస్ పరిచారకులిద్దరూ నన్ను రాణిని చూసినట్లుచూసేవారు. అయినా ఈ నిర్బంధం విసుగు కలిగిస్తుందికదా! నేను ఇక తప్పించుకోనని ధీమాగా ఉన్న నౌకర్లు అశ్రద్ధ చేశారు. ఒకరోజు చీకటితోనే లేచి తప్పించుకున్నాను. నడక సాగించానుకాని నా అదృష్టంకొద్దీ దారిలో ఒక లారీ తటస్థించింది. దానిలో ఎక్కి 'పామ్‌స్ప్రింగ్స్' చేరుకున్నాను. అక్కడినుంచి హాలీవుడ్ చేరుకున్నాను. అక్కడ 'మొకాంబో' అనే రెస్టారెంట్‌లో ఫ్రాంకీ కచ్చేరీ చేస్తున్నాడు—ఉచితంగా. దాని మాజీ యజమాని చార్లెస్ మారిసన్ చనిపోవటంచేత అతని భార్యకి ఈవిధంగా సాయపడుతున్నాడన్నమాట.

నన్ను చూడగానే ఎంతో ఆప్యాయంగా పలకరించాడు. పాత విషయాలన్నీ ఇద్దరం మర్చిపోయాము!

(అయిపోయాయి) ●



సంధ్యారాణి



హరనాథ్



జయలలిత

# నవచిత్రసీమకు నవనాయికలూ,

రోజులు దొర్లిపోవటం అంటే భావాలు కూడా అంతకుమించిన వేగంతో పరుగులు తీస్తూ గతాన్నంతా చరిత్ర పుటల్లోకి నెట్టివేయటం అన్నమాట.

ప్రపంచంలో అన్ని రంగాలలో విశేషమైన మార్పు వస్తున్నది. రాజకీయాలు కొన్నిచోట్ల ప్రజ్వరిల్లితే, మరికొన్ని చోట్ల స్తంభించిపోతున్నాయి. రాజ్యాలు పతనమవుతున్నాయి; క్రొత్తవి ఆవిర్భవిస్తున్నాయి. విన్నటిరోజున, అడుగులకు మడుగులొత్తింతుకొన్నవారు, యీనాడు మచ్చుకైనా కనిపించటం లేదు. అట్టఅడుగున వున్నవారు కొందరు అకస్మాత్తుగా పైకి వస్తున్నారు.

ఈ చైతన్యం సినిమారంగానికి కూడా బాగా వర్తిస్తుంది. ఎంతకాదనుకొన్నా, ఎంత లేదనుకొన్నా, సినిమారంగంలోని 'పరిస్థితులు', యీ పరిస్థితుల చుట్టూ పరిభ్రమించే వ్యక్తులూ మారిపోవటం జరుగుతోంది.

ఈ మార్పు మనకు 1964—65లో బాగా కనిపిస్తున్నది. గత రెండు సంవత్సరాలలో తెలుగు చిత్రరంగానికి వచ్చినంత మంది కొత్తవారు, దక్షిణాది సినిమారంగపు చరిత్రలో యింతకుముందెన్నడూ రాలేదు.

కొత్తవారు కావాలనే ప్రయత్నం గత రెండు, మూడు సంవత్సరాలనుంచీ తీవ్రంగానే జరుగుతూ వున్నది. కాని, సినిమారంగంలో "ప్రయోజనకరమైన" మార్పు రావటానికి కొంత ఆలస్యం పడుతుంది. అలాగే యీ కొత్తవారి 'సమస్య' కూడా పరిపక్వ దశకు రావటానికి యింతకాలం పట్టింది.

'తేనెమనసులు' చిత్రం తయారవకముందు యీ సమస్యను గురించి ఎవరూ అంత తీవ్రంగా ఆలోచించినట్లు కనిపించదు. అంతమాత్రాన కొత్తవారు లేరనికాదు. అలా అనుకొంటే యిప్పుడున్న పాతవారంతా ఒకప్పటి కొత్తవారే. కాని, ఒకప్పుడు వెండితెరకు పరిచయం అయినవారి సంఖ్యతో, ప్రస్తుతం వస్తున్న వారి సంఖ్యను పోల్చి చూస్తే నిజంగా ఆశ్చర్యం వేస్తుంది. ఒకప్పుడు నటుడు రమణమూర్తిని యం. ఎల్. ఏ. చిత్రంద్వారా పరిచయం చేశారు. "ఎత్తుకు పైఎత్తు" చిత్రంలో బాలయ్యని పరిచయం చేశారు. "మా యింటి మహాలక్ష్మి"తో హరనాథ్ సినిమా ప్రపంచానికొచ్చారు.

కాని, 'తేనెమనసులు' చిత్రం తెలుగు సినిమా ప్రపంచంలోనే ఒక విప్లవాన్ని తీసుక వచ్చిందని చెప్పాలి. ఒక్కుమ్మడిగా యింతమంది నటీనటులు పరిచయంకావటం మొదటిసారి! కొత్తవారితో, అందునాచిత్రం ఆసాంతం, అన్నీ కొత్త ముఖాలతో సాహసం చేయటం విశేషమే. ఈ చిత్రం ఎంతవరకు, ఎలా విజయవంతం అయిందో నాకు తెలియదుగాని, కొత్తవారి ఆగమనానికిమాత్రం 'తేనె మనసులు' చిత్రం రాచమార్గాన్ని ఏర్పరచింది.

'తేనెమనసులు' చిత్రంతో పరిచయం అయిన వారిలో ముఖ్యులు, యిద్దరు నాయకులు, యిద్దరు నాయికలు.వారిలో కృష్ణకు అప్పుడే మంరోచిత్రం (రాజ్యలక్ష్మివారిది) లో అవకాశం వచ్చింది. రామ్మోహన్, సుకన్యలకు బి.ఎన్. రెడ్డిగారి 'రంగులరాట్నం'లో ప్రధాన భూమికలే లభించాయి. అలాగే సంధ్యారాణి క్కూడా అవకాశాలొస్తున్నాయి.

ఈ నలుగురితోబాటు తెలుగు చిత్రసీమకు ఎందరో పరిచయం అయ్యారు. శ్రీకె.వి. నాగేశ్వరరావును ప్రసాద్ప్రొడక్షన్స్ వారు 'ఇల్లాలు' ద్వారా పరిచయం చేశారు. ఈ 'ఇల్లాలు' చిత్రం ఎట్టకేలకు వివాదాంశం అయింది(?).

అలాగే, తమిళంలో 'వెన్నిర్ ఆడయ్' చిత్రం ద్వారా దక్షిణాదివారి దృష్టిని ఆకర్షించిన జయలలిత, 'మనుషులు—మమతలు' చిత్రంతో తెలుగువారికి పరిచయం అయింది. జయలలిత తెలుగులో కొత్త నటి అయినా కొత్తవారికుండే యిబ్బందులు యీమెకు లేవు. ఈమె తల్లి సంధ్య కూడా బాగా పేరు మోసిన నటి. తెలుగులో కూడా ఎన్నో చిత్రాల్లో నటించింది. దానికితోడు జయలలిత, రెండు మూడు చిత్రాలతోనే తమిళ



కృష్ణంరాజు



కె. వి. నాగేశ్వరరావు



విజయనిర్మల (ముఖచిత్ర సుందరి)

# రవ నాయకులూ!

చిత్రరంగంలో మంచిస్థానాన్ని సంపాదించుకొంది. తత్ఫలితంగా, ఆమె తమిళంలోని అగ్రశ్రేణి తారల్లో ఒకరయ్యారు. అంతకు పూర్వమే జయలలిత కన్నడ చిత్రాల్లో మంచి పేరు సంపాదించుకొన్నది.

ఇటీవల వచ్చినవారిలో మరొక అగ్రనటి కె. ఆర్. విజయ. 1965 లో తమిళంలో విడుదలయిన 'కర్పగం' (తెలుగులో యిదే తోడూ—నీడ) ద్వారా కె. ఆర్. విజయ తమిళసినిమారంగంలో ముఖ్యురాలయింది. ఈ నటిని తెలుగు సినిమారంగానికి తొలిసారిగా పరిచయంచేసినది శ్రీ ఎన్. టి. రామారావు—శ్రీ కృష్ణపాండవీయంలో! ఆమెకు 'పరమానందయ్య శిష్యులు' కథ మరో అవకాశం వచ్చింది.

వెండితెరకు పరిచయం అవుతూవున్న నాయకుల్లో కృష్ణంరాజుపేరు విస్మరించలేం.



భారతి



సుకన్య

నిన్న మొన్నటివరకు ఓ మంచి కథకు కేవలం "స్టార్స్"నే ఎన్నుకొన్న ప్రత్యగాత్మ గారు తొలిసారిగా ఓ కొత్త కుర్రాణ్ణి నాయకపాత్రకు ఎన్నుకొన్నారు. "చిలకా—గోరింక"లో పరిచయం అవుతున్న యీ కొత్త నటుణ్ణి గురించి అప్పుడే వ్యాఖ్యానించలేము.

హైదరాబాద్ మూవీస్‌వారు 'భారతి'ని తమ 'అర్ధరాత్రి' చిత్రంలో నాయికగా పరిచయం చేస్తున్నారు. కన్నడ భారతికి తెలుగు చిత్రసీమ కొత్తదే. కన్నడంలో అగ్ర నటుడయిన కళ్యాణకుమార్, తన స్వంత చిత్రం 'లవ్ యిన్ బెంగుళూర్" ద్వారా ఈమెను సినీరంగానికి పరిచయం చేశారు. అనుకోకుండా తెలుగులో అవకాశాలొచ్చాయి.

అలాగే నటి విజయ నిర్మలకూడా. నాగిరెడ్డిగారు "ఎంగవీట్టు పెణ్" చిత్రంలో విజయనిర్మలకు ప్రధాన భూమికనిచ్చారు. ఇప్పుడామెకు బి. ఎన్. రెడ్డిగారి 'రంగుల రాట్నం'లో మరోమంచిఅవకాశం లభించింది.

కొంచెం పాతబడిన కొత్తవారికికూడా అవకాశాలొస్తూనే ఉన్నాయి. యువతరంలో శోభన్‌బాబు ముఖ్యుడయినాడు. అలాగే గీతాంజలి కూడా తన స్థానాన్ని నిలుపుకొన్నది. తొలుత తమిళంలో పరిచయమయిన నటి వాసంతి కూడా ఒక పరిధిలో చక్కని నటిగా అందరి ఆదరాభిమానాలను చూరగొన్నది. హరనాథ్‌కు అవకాశాలు మిక్కుటంగా ఉన్నాయి. శారద, వాణిశ్రీ, మణిమాల, రాజశ్రీ, కాంచన ప్రభృతులు గత రెండు, మూడు సంవత్సరాలలో తమ ఉనికిని బాగా గుర్తింపచేశారు.

కొత్తవారు రావటం పాతవారికి యిష్టం లేదనే ఒక దురభిప్రాయం బాగా ప్రబలిపోవటం మన దురదృష్టం. ఉదాహరణకు అక్కినేని నాగేశ్వరరావులాంటి నాయకులు కొత్తవారి ఆవశ్యకతను నాటికీ, నేటికీ ఉద్ఘాటిస్తూనే వున్నారు. 'తేనె మనసులు' ప్రయత్నాన్ని అభినందించిన వారిలో నాగేశ్వరరావు గారు ప్రథములని కొందరికే తెలుసు.

కొత్తవారిని తీసుక వస్తున్నవారు, వారికోసం కలవరిస్తున్నవారు ప్రధానంగా గుర్తించుకోవలసిన విషయాలెన్నో వున్నాయి. ఇలా వచ్చేవారికి అనవసరమైన ఆశలు కల్పించటం వ్యర్థం. 'వెండితెర'కు నిజంగా వెలుగులు కాగలిగేవారినే తీసుకరండి. ఇప్పటికి యీ కొత్తవారు చాలేమో! వీరందరి 'ప్రతిభ'ను సినిమారంగం అవసరాలకు అనుగుణ్యంగా మలచుకోవాలి. కొత్తవారు అవసరమేగాని, తండోపతండాలుగామాత్రం అక్కరలేదు. కొత్తగా వచ్చే వీరికి కనీసపు అవకాశాలు లేనిదే, వారిని తీసుకవచ్చి, ఆ తరువాత వారిని యిబ్బందుల పాలుచేసి ప్రయోజనంలేదు. ఇది నిర్మాతలు, దర్శకులు గుర్తించుకొంటే 'సినిమారంగం' అంతత్వరగా పతనంచెందదు!

—వాశిరాజు ప్రకాశం



అవార్డు అందుకొన్న 'ఆత్మగౌరవం' బృందంతో ముఖ్యమంత్రి; కుడివైపు చివరవ్యక్తి: రచయిత్రి యం. సులోచనారాణి.

# వివాదాంశమయిన తెలుగు చిత్రోత్సవం...!

## బొసాని సుదర్శన్ రెడ్డి

హైదరాబాదులో చలనచిత్ర పరిశ్రమను స్థిర పరచడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కావిస్తున్న కృషి ఆశించినంతగా ఫలవంతం కావడం లేదన్న విచారం ద్వితీయ చలన చిత్ర బహుమతి ప్రదానోత్సవం నాటి వేదికపై వ్యక్తమైనది.

అగ్రనటులు అక్కినేని నాగేశ్వరరావు—ఎన్. టి. రామారావుమధ్య, వారి నిర్మాతలమధ్య ఉత్పన్నమైన అపోహలవల్ల, అభిప్రాయభేదాలవల్ల తెలుగు చిత్ర పరిశ్రమకూడా రెండు వర్గాలుగా చీలిపోయి వెలిరేగడం సినీమాకళ దౌర్భాగ్యంగా వర్ణిస్తున్నారు; అందుకే, రాజధానిలో ఫిలిం పరిశ్రమ గమనం మందంగా ఉందని వ్యాఖ్యానిస్తున్నారు.

తెలుగు సంవత్సరాది — ఆంధ్రుల పర్వదినమూ అయిన ఉగాదినాడే రాష్ట్రప్రభుత్వం ఏర్పాటు చేసిన ఈ బహుమతి ప్రదానోత్సవం కమనీయంగా జరుగక పోవచ్చు. కానీ రమణీయంగా జరిగింది. ఒక్క పి. పుల్లయ్య మినహా ఈ ఉత్సవాన్ని తిలకించడానికి తెలుగు చిత్రపరిశ్రమలోని ప్రముఖులైన నిర్మాతలు, పటే నటులు, దర్శకులు, సాంకేతిక నిపుణులు ఎవ్వరూ ప్రత్యేకించి రాలేదు. గణనీయులైన వ్యక్తులందరికీ ప్రభుత్వం ఆహ్వానాలు పంపించినది. కమనీయంగా జరుగవలసిన ఈ కళోత్సవంలో అధిక సంఖ్యలో కళాకారులు పాల్గొనకపోవడం తెలుగు పరిశ్రమ దురదృష్టమని అఖిల భారత ఫిలిం ఫెడరేషన్ అధ్యక్షుడు ఎ. ఎల్. శ్రీనివాసన్ కూడా వ్యాఖ్యానించారు.

బహుమతి ప్రదానోత్సవ వేదిక ఆవేదనాత్మకమైన గోష్ఠి వేదికగా రూపొందడం మరో విశేషంగా భావిస్తాను. పరిశ్రమ అవలంబిస్తున్న వైఖరి గురించి, చిత్రాల ప్రమాణాల గురించి ఈ వేదికపై రాష్ట్రమంత్రులు అసంతృప్తిని ప్రకటించారు.

ప్రభుత్వం లక్షించిన నంది అవార్డుల లక్ష్యం పరిశ్రమవర్గాల్లో వ్యాప్తి చెందకపోవడంవల్లనే ఈసారి కూడా ఉత్తమ చిత్రాల పోటీలో ఎక్కువ చిత్రాలు పాల్గొనలేదన్న ఆవేదనను సమాచారశాఖామంత్రి బి. వి. గురుమూర్తి అభివ్యక్తపర్చారు.

ప్రభుత్వ కృషికి తోడ్పాటుగా, పరిశ్రమ తరఫున తగినంత ముందంజ కనిపించడంలేదనీ, సారథి స్టూడియో విస్తరణ కార్యక్రమం 'నెమ్మది'గా జరుగుతున్నదనీ, ఎల్. వి. ప్రసాద్‌గారి స్టూడియో తొందరగా రాలేకపోయిందన్న వేదనను ఆర్థిక మంత్రి చెన్నారెడ్డి వ్యక్తపర్చారు.

చలనచిత్ర బహుమతుల నిర్ణయానికి కనీస సంఖ్యలో ఎంట్రీలుండాలనీ, కనీస నిర్ణీత స్థాయితో విలువలున్నప్పుడే బహుమతులివ్వాలని ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి సూచించారు.

ఈసారి కూడా డాక్యుమెంటరీ చిత్రాలు, బాలల చిత్రాలు, విద్యాచిత్రాలు ఆయా విభాగాల పోటీకి ఎంట్రీలుగా అసలే రాకపోవడం గౌరవమా? అని గవర్నరు శ్రీ ఖానువిల్కర్ ప్రశ్నించారు.

1965 లో నిర్మాణమైన చిత్రాల్లో జగపతి పిక్చర్స్ 'అంతస్తులు'కు ప్రథమ బహుమతి, రామకృష్ణ ఎన్. ఏ. టి. కంబైన్స్ వారి 'శ్రీకృష్ణ పాండవీయం'కు ద్వితీయ బహుమతి, అన్నపూర్ణా పిక్చర్స్‌వారి 'ఆత్మ గౌరవం'కు తృతీయ బహుమతులు లభించాయి.

క్రిందటేడు మాదిరిగానే ఈయేడూ ఉత్తమ చిత్రాలపోటీకి తొమ్మిది చిత్రాలు మాత్రమే ఎంట్రీలుగా వచ్చాయి. వాటి పేర్లుకూడా తెలియజేస్తాను. అంతస్తులు, శ్రీకృష్ణ పాండవీయం, ఆత్మగౌరవం, దొరికితే దొంగలు, మనుషులు—మమతలు, సతీ సక్కుబాయి, వీరాభిమన్యు, పల్నాటియుద్ధం, తేనె మనసులు.

ఉత్తమ చిత్రాల నిర్ణాయక సంఘాన్ని ప్రభుత్వం హైకోర్టు న్యాయమూర్తి గోపాలరావు ఎక్బోటే అధ్యక్షతన ఏర్పాటు చేసింది. అందులో దేవులపల్లి కృష్ణశాస్త్రి, కె. వి. గోపాలస్వామి, వి. వి. మాణిక్యాలరావు సభ్యులు. అవార్డులు అందజేయడానికి నగరంలోని ఎగ్జిబిషన్ మైదానంలో మార్చి 23 నాటి సాయంత్రం ఉత్సవం ఏర్పాటైనది. దాదాపు ఐదు వేల మంది ఆహ్వానితులకుపైగా ఈ ఉత్సవంలో పాల్గొన్నారు.

మంత్రి డాక్టర్ యమ్. చెన్నారెడ్డి సహజమైన ఉద్వేగస్వరంతో మాట్లాడుతూ, పోటీకి ఎందరొస్తున్నారన్నది ప్రశ్నే కాదన్నారు.

ప్రభుత్వకృషిని ప్రస్తావిస్తూ, "ఇన్‌సెంటివ్స్ (ప్రోత్సాహకా చర్యలు) పాత మాటే అయింది. ఈ సినీమారంగంలో ఒక రకమైన ఉత్తేజం కలిగించడానికి మరేవైనా చర్యలున్నాయేమో గమనించవలసిన సమయం ఇది. అందర్నీ కలిపి ఒకే వేదికపై ఒక సంస్థను ఏర్పాటు చేయాలని ప్రయత్నించాము. అది జరుగలేదు. అందుకు విచారంగా ఉంది" అన్నారు.

ఆ తర్వాత ముఖ్యమంత్రి ఉత్తమ చిత్రాల బహుమతులు అందజేశారు.

విశేషం: 'శ్రీకృష్ణపాండవీయం' నిర్మాత ఎన్. త్రివిక్రమరావు ముఖ్యమంత్రి నుంచి పదివేల, మహాడు వేల నగదు బహుమతిని స్వయంగా అందుకున్నారు. ఈ చిత్రం దర్శకుడుగా వెయ్యి రూపాయల బహుమతిని, ఒక ప్రశంసా పత్రాన్ని, పైగా చిత్రంలో ప్రధాన పాత్రధారిగా మరో ప్రశంసా పత్రాన్ని స్వీకరించవలసిన ఎన్. టి. రామారావుగానీ, ప్రధాన పాత్రధారిణిగా ప్రశంసా పత్రాన్ని పొందవలసిన కె. ఆర్. విజయగారినీ, లేదా వారిస్థానే ఇతర కళాకారుల్ని, బహుమతి స్వీకారానికి నిర్మాత సూచించి పంపలేదు. కానీ తన బహుమతిని స్వీకరించడానికి రామారావు తన కుమారుడిని ఈ ఉత్సవానికి పంపించారు. ప్రభుత్వ నిబంధనల ప్రకారం బహుమతి గ్రహీతలే స్వయంగా ప్రశంసా పత్రాల్ని పొందవలసి ఉన్నందున, ఆ బహుమతుల ప్రదానం జరుగలేదు.

ఉత్తమ కథా రచయితలకు కూడా నగదు బహుమతిని ఏర్పాటు చేయడం ఈసారి ఉత్సవం విశేషం.

## కనీస ప్రమాణాల చిత్రాలకే బహుమతులు

ముఖ్యమంత్రి మాట్లాడుతూ, కొన్ని ముఖ్య సూచనలు చేశారు. పోటీకి వచ్చిన పరిమిత చిత్రాల్లోనే ఏవో కొన్నింటిని మంచి చిత్రాలుగా ఎంపిక చేసి బహుమతులు పంపిణీ చేయడం మంచిదికాదన్న అభిప్రాయం ఆయన ప్రసంగంలో ధ్వనించింది. పోటీలో ఎక్కువ చిత్రాలు పాల్గొనాలి. లేదా ఎంట్రీల కనీస సంఖ్యను నిర్ణయించాలన్నారు. ఉత్తమచిత్రాలను ప్రోత్సహించడమే ప్రభుత్వ అవార్డుల ఉద్దేశం కనుక, కనీస ప్రమాణాలు ఉంటే తప్ప ఉత్తమ బహుమతులు ఇవ్వరాదని సూచించారు. 'అంతస్తులు' చూసాను............ బాగానే ఉంది. సాంఘిక చిత్రాల్లో ఇది ప్రజల మన్ననలను పొందినదనీ, బాగా డబ్బు చేసుకుందని విన్నాను' అని ఆయన అన్నారు. అవార్డు ఉత్సవం ఇంకా అందరికీ ప్రోత్సాహకరంగా ఉండాలని ముఖ్యమంత్రి చెప్పారు.

గవర్నరు మాట్లాడుతూ చలనచిత్రాలు మన యువతీ యువకులను పెడదారి పట్టించేవిగా, మన సామాజిక విలువలను దిగజార్చేవిగా ఉండరాదని హితవు చెప్పారు. విద్యా చిత్రాలకు, బాలల చిత్రాలకు చాలా ప్రాముఖ్యమున్నది. వాటినిర్మాణం పట్ల శ్రద్ధ వహించేటట్టు చేయడానికి ప్రభుత్వం ఇంకా ఎక్కువ ఆకర్షణలు కల్పించాలని కూడా ఆయన అన్నారు.

### నిర్మాతల స్థితిగతులు

'అంతస్తులు' దర్శకుడు వి. మధుసూదన్‌రావు ప్రసంగిస్తూ, నిర్మాతలు, కళాకారులు ఎదుర్కొంటున్న ఇబ్బందులను వివరించారు. 'నేను అంతస్తులు చిత్రాన్ని అవార్డు రావాలన్న ఉద్దేశంతో డైరెక్టు చేయలేదు. డబ్బు రావాలనే తీసాను. డబ్బుకోసం, పామరజనరంజనంకోసం కొన్ని కొన్ని అనివార్యంగా చేర్చాల్సి వస్తుంది. అది మాకు ఇష్టమైకాదు. నిర్మాతకు నష్టం రాకుండా ఉండాలి. ఉత్తమస్థాయి చిత్రం తీయాలంటే ప్రభుత్వపరంగా ఇంకా ఎక్కువ ఆర్థిక సహాయం రావాలి. పోటీకి ఎక్కువ చిత్రాలు రాకపోవడానికి కారణాలున్నాయి. ఒక ప్రింటుకు 6,500 రూపాయల ఖర్చు అవుతున్నది. ప్రింటుతీసి పోటీకి పంపించే నిర్మాతలున్నారని నేను అనుకోను. ఇది నూటికితొంభై మంది నిర్మాతల పరిస్థితి. ఉత్తమ చిత్రాలకు అవార్డు లిస్తున్నారు. వాటికి డబ్బు రాకపోతే, పన్ను మినహాయింపు చేయాలి. పన్నుల బాధతో, ముడి ఫిలిం సమస్యతో నిర్మాతలు చాలా ఇబ్బంది పడుతున్నారు. ఈ పన్నుల విషయం పరిశీలించడానికి ప్రభుత్వం ఒక కమిటీ వేయాలని కోరుతున్నాను," అని ఆయన అన్నారు.

తర్వాత హాస్యనటుడు శ్రీ రేలంగి, నిర్మాత శ్రీ రాజేంద్రప్రసాద్, ఎ. ఎల్. శ్రీనివాసన్, అక్కినేని నాగేశ్వరరావు, వాసుదేవరావు, కాంచన ప్రభుత్వం కావిస్తున్న కృషిని ప్రశంసిస్తూ కృతజ్ఞతలు తెలియజేశారు. ఉత్తమచిత్రంగా ఎన్నికైన 'అంతస్తులు'ను ఉదయం ప్రత్యేక ఆహ్వానితులకు చూపించారు. ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి ఈ ప్రదర్శనకువచ్చేశారు.

క్రిందిపేటి మాదిరిగా కాకుండా ఈసారి అవార్డు లసంఘం ప్రకటించిన బహుమతులు ప్రజల్లోనూ, పత్రికల్లోనూ వివాదాస్పదంగా పరిణమించాయి. తదనుగుణ్యంగానే, ముఖ్యమంత్రి కనీసప్రమాణాలుగల చిత్రాలకే బహుమతులు ఇవ్వాలని ప్రకటించారేమో! ●

# వార్తలు - విశేషాలు

సమాచార, బ్రాడ్‌కాస్టింగ్‌ల శాఖల అధిపత్యాన్ని స్వీకరించిన కేంద్రమంత్రి శ్రీ రాజబహదూర్ గతవారంలో తొలిసారిగా మదరాసుకు వచ్చారు. ఆయన యీ 'సినిమా నగరం'లో వున్నది చాలా కొద్ది కాలమే అయినా, యీ కొద్దిసేపట్లోనే ఆయన్ను యిక్కడివారు ఆనంద డోలికల్లో ముంచివేశారు. సన్మానాలు ఘనంగా జరిగాయి.

'సినిమారంగం' తరఫున జరిగిన రెండు పెద్ద సభలో, సౌత్ ఇండియన్ ఫిలిం చేంబర్స్‌వారు ఏర్పరచింది ఒకటి. శ్రీ ఎ. ఎల్. శ్రీనివాసన్ అధ్యక్షత వహించిన యీ సభలో శ్రీ నాగిరెడ్డి వినతిపత్రాన్ని అందచేస్తూ, ముడిఫిలిం కొరత, దిగుమతుల కోటాలను చాలా మేరకు తగ్గించటంవలన కలిగిన లాభనష్టాలను, పన్నుల భారాన్ని గురించి ప్రసంగించారు. 50 సంవత్సరాలు గడిచినా, ఫిలిం పరిశ్రమకు నేటివరకు ఒకస్థాయి చేకూరలేదని, ఆ లక్ష్యాన్ని అందుకోవటానికి ఎన్నో అవాంతరాలు అడ్డు వచ్చాయని ఆయన అన్నారు. పన్నులభారం, యితర అసౌకర్యాలమూలంగా నిర్మాతలు కష్టనష్టాలు ఎదుర్కొంటున్నారని, 6 లక్షలుపెట్టి సినిమాతీస్తే, ఆచిత్రం మొత్తం 40 లక్షలు సంపాదిస్తేనే నిర్మాతకు తన డబ్బు వచ్చే పరిస్థితి ఏర్పడిందన్నారు. అనంతరం శ్రీ ఏ. ఎల్. శ్రీనివాసన్ ప్రసంగిస్తూ, సెన్సార్ విధానాల్లో దేశమంతటా ఒకే విధానాలుండాలని సూచించారు.

మంత్రి శ్రీ రాజబహదూర్ ప్రసంగిస్తూ మన సినిమాలు, మన సంస్కృతిని, మన ప్రాచీన ఔన్నత్యాన్ని ప్రతిబింబించాలన్నారు. విదేశీ అలవాట్లకు అనవసరంగా ప్రాకులాడటం వలన ప్రయోజనం లేదన్నారు. ముడి ఫిలిం, పన్నుల భారం.....మొదలైన సమస్యలను తాను సావకాశంగా పరిశీలించగలనన్నారు.

చేంబర్ సభను ముగించుకొంటూ శ్రీరాజబహదుర్, ఫిలిం ప్రొడ్యూసర్స్ గిల్డ్‌సభలో పాల్గొన్నారు. శ్రీ డి. వి. ఎస్. రాజు ఆహూతులకు స్వాగతం చెప్పిన యీ సభలో పలువురు నిర్మాతలు తమ కష్ట నిష్ఠూరాలను వివరించారు. ఈ సందర్భంలో మంత్రి శ్రీ రాజబహదూర్‌కు సమర్పించిన సన్మానపత్రంలో, ఫిలిం పరిశ్రమకు సంబంధించిన అవసరాలను గురించి, నిర్మాతల సాధక బాధకాలను ప్రస్తావించారు. మంత్రి శ్రీ రాజ్‌బహదూర్ వీటికి సముచితరీతిన సమాధానం యిచ్చారు.

కుమారి యడవల్లి రమ ప్రదర్శించిన 'కూచిపూడి' నృత్యంతో ఆనాటి కార్యక్రమం సమాప్తం అయింది.

## 1966 సినిమా డైరీ

శ్రీ బి. బలరామరెడ్డి సంపాదకత్వాన వెలువడిన 1966 వ సంవత్సరం సినిమా డైరీ మా కార్యాలయం చేరినది.

ఇందులో సినిమా పరిశ్రమకు సంబంధించిన వివరాలన్నీ పూర్తిగా ఉన్నాయి. 1966వ సంవత్సరానికి పన్నెండు నెలలకూ 12 తారల రంగుల ఛాయాచిత్రాలతో కేలెండర్, నటీనటుల రంగుల ఫోటోలు, తారలు—తారఫలాలు, ఆంధ్రప్రదేశ్‌లోని థియేటర్ల ఫోన్ నెంబర్లు 1931 నుంచీ 65 వరకూ విడుదలైన తెలుగుచిత్రాలు, నటీ నటుల, సాంకేతిక నిపుణుల చిరునామాలు, టెలిఫోన్ నెంబర్లు, హిందీతారల అడ్రసులు, పుట్టిన తేదీలు, సినిమాటోగ్రాఫ్ ఆక్ట్, ఆంధ్ర గవర్నమెంట్ సినిమా ఆపరేటర్ల ఎగ్జామినర్స్ బోర్డు నిబంధనలు, హైదరాబాద్, ఆంధ్ర ఫిలిం ఛేంబర్ల వివరాలు, డైరీ ఉన్నాయి. చక్కని ముద్రణ, ఆకర్షణీయమైన ఛాయాచిత్రాలతో అందంగా రూపొందింపబడింది. 280 పేజీలు. వెల : మూడు రూపాయలు. కాపీలకు భారత్ డిస్ట్రిబ్యూటర్స్, 2/25 ఎడ్వర్డ్ ఇలియట్స్‌రోడ్, మైలాపూర్, మద్రాసు—4. ●

# సినిమా వార్తలు

## సెట్సుకు వెళ్లిన 'సుమతి'

చిన్నీ బ్రదర్సువారు 'సుమతి' కథను రెండవ చిత్రంగా తీయడానికి నిర్ణయించుకున్నారు. ఈమధ్య వీనస్ స్టూడియోలో 'సుమతి' ఇంటి ఆవరణలో శివ పార్వతుల ప్రతిమతో సెట్టువేశారు. ఆ ప్రతిమకు సుమతీపూజ చేస్తున్నట్లు పాట పాడినట్లు షూటింగ్ జరిపారు. ఈ చిత్రానికి యిదే ప్రారంభం. ఈ ప్రారంభోత్సవానికి ఫిలిం పరిశ్రమలోని పలువురు పెద్దలు, నటీ నటులు హాజరైనారు. వాణి ఫిలింస్ అధినేత శ్రీ కాకర్ల వెంకటేశ్వరరావు స్విచ్ ఆన్ చేశారు.

ఈ చిత్రంలో ప్రధాన పాత్ర శ్రీమతి అంజలీదేవి పోషిస్తుంది. ఇంకా యస్. వి. రంగారావు, గుమ్మడి, రేలంగి, హరనాథ్, సత్యనారాయణ, సూర్యకాంతం, గిరిజ, పుష్పవల్లి మొదలగువారు నటిస్తారు. దర్శకత్వం వేదాంతం రాఘవయ్య నిర్వహిస్తున్నారు.

## రవీంద్ర ఆర్ట్ ప్రొడక్షన్స్ నెం.2

రవీంద్ర ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారు రెండవ చిత్రం కూడ సాంఘికమే నిర్మిస్తున్నారు. ఇంతవరకు రెండు సెట్ల పని పూర్తి చేశారు. సి. నారాయణరెడ్డి, ఆచార్య ఆత్రేయ వ్రాసిన రెండు పాటలనుకూడా చిత్రీకరించారు.

ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, రమణారెడ్డి, అంజలీదేవి, కాంచన, బేబి పద్మిని, మాష్టర్ ఆదినారాయణరావు, రత్నశ్రీ వగైరా నటిస్తున్నారు. ఈ చిత్రానికి దర్శకుడు వి. మధుసూదన రావు, నిర్మాత—డి. వి. రెడ్డి.

## ఔట్ డోర్‌లో రిపబ్లిక్ ప్రొడక్షన్స్

రిపబ్లిక్ ప్రొడక్షన్స్‌వారు ప్రస్తుతం నిర్మిస్తున్న చిత్రం తొమ్మిదిరీళ్లు పూర్తి అయింది. శ్రీ ఘంటసాల, శ్రీమతి సుశీల పాడిన ఒక యుగళగీతాన్ని యీ మధ్య భరణి స్టూడియోలో రికార్డింగ్‌చేశారు. పై పాటను శోభన్‌బాబు, రాజశ్రీతో చిత్రీకరించారు.

ఈ చిత్రానికి నిర్మాత,—దర్శకుడు. సి. సీతారాం!

## చాముండేశ్వరీ ప్రొడక్షన్స్ నెం1.

చాముండేశ్వరీ ప్రొడక్షన్సువారు ప్రారంభిస్తున్న చిత్రంలో అవుట్‌డోర్ దృశ్యాలు మొదట చిత్రీకరించదలచారు. ఈచిత్రంలో కాంతారావు, రాజనాల, చలం, సత్యనారాయణ, కృష్ణకుమారి మొదలగువారు నటిస్తారు. ఆరుద్ర వ్రాసిన రెండు పాటలను గోల్డెన్ సూడియోలో రికార్డింగ్ చేశారు. ఈ రెండు పాటలను అవుట్‌డోర్‌లోనే చిత్రీకరిస్తారు. సంగీతం — కోదండపాణి నిర్వహిస్తున్నారు. దర్శకత్వం : జి. బంగారురాజు వహిస్తున్నారు.

## అందంకోసం పందెం

హృషీకేశ్ పిక్చర్సు వారి తొలి జానపద చిత్రానికి 'అందం కోసం పందెం' అని నామకరణం చేశారు. ఈ చిత్రంలో కాంతారావు, కాంచన ప్రధాన భూమికలు నిర్వహిస్తున్నారు. ఇంకా రమణారెడ్డి, చలం, రాజనాల, మిక్కిలినేని, రాజబాబు, వరప్రసాద్ మొదలగువారు నటిస్తున్నారు.



'పొట్టి ప్లీడరు' లో పద్మనాభం,మాష్టర్ మురళి.

దర్శకత్వం సి. రంగనాథదాస్ వహిస్తున్నారు. నిర్మాత—వై. వి. కృష్ణయ్య.

### 'భీమేశ్వరపురాణం అంకితం'

వీరభద్రారెడ్డి ఆజ్ఞపై శ్రీనాథుడు విజయనగరం, రాచకొండలకు బయలుదేరాడు. ఆ రాజ్యాలు వెళ్లి రాచకార్యాలు చక్కబెట్టుకొని కొండవీడు వచ్చేసరికి, ఆకోట శత్రురాజుల వశమైనట్లు తెలిసి, తన మోహాంగి అయిన హేమాంగినిఉన్న ద్రాక్షారామం చేరాడు శ్రీనాథుడు. రాజమహేంద్రవరం మహామంత్రిఅయిన అన్నయ్యామంత్రి కనిపించి భీమేశ్వర పురాణం వ్రాసి తనకు అంకిత మివ్వమని కోరాడు. శ్రీనాథుడు వ్రాయుటకు నిరుత్సాహపడుచుండగా, హేమాంగిని తన అపూర్వ నాట్యంతో శ్రీనాథుణ్ణి ప్రోత్సాహపరచింది. శ్రీనాథుడు భీమేశ్వర పురాణంవ్రాసి అన్నయమంత్రికి అంకితమిచ్చాడు. రాజమహేంద్రవర ప్రభువైన వీరభద్రారెడ్డికి కాశీఖండాన్ని అంకితమిచ్చి ఆస్థాన కవిగా ఉండసాగాడు.

భీమేశ్వర పురాణం వ్రాయటానికి హేమాంగిని శ్రీనాథుడ్ని ప్రోత్సహిస్తూ చేసిన నాట్యం సుమారు 8 నిమిషలు ఉంటుంది. ఆరుద్ర వ్రాయగా శ్రీమతి సుశీల పాడితే రికార్డింగ్ జరిపారు. ఈనాట్యం మూడు రకాలుగా ఉంటుంది.

ఈ సన్నివేశం భారత్ పిలింస్‌వారి 'భక్తపోతన'లో దర్శకుడు రామినీడు చిత్రీకరించారు. నిర్మాత—టి. విశ్వేశ్వరరావు.

### పి వి. వి. ఎస్. ఎమ్ ప్రొడక్షన్స్

రచయిత శ్రీ అనిసెట్టి సుబ్బారావు దర్శకత్వంలో పైసంస్థవారు సాంఘికచిత్రాన్ని నిర్మించటానికి ఇటీవలనే విజయ స్టూడియోలో గణపతి పూజ చేశారు. నటీ నటుల ఎన్నిక చేస్తున్నారు. నిర్మాత పి. వి. వి. సత్యనారాయణమూర్తి. వీరి మొదటిచిత్రం 'భట్టి విక్రమార్క.'

### ఏ. వి. యం. వారి రెండు తెలుగు చిత్రాలు

ఏ. వి. యం. వారు ఒకేసారి రెండు తెలుగు చిత్రాలు నిర్మిస్తున్నారు. ఒకటి పౌరాణికచిత్రం. 'భక్తప్రహ్లాద' పేరుతో తీస్తున్న యీ చిత్రంలో ప్రధాన పాత్రలు



'అగ్గిబరాటా' లో రాజశ్రీ, వాణిశ్రీ

హిరణ్య కశిపుడుగా యస్. వి. రంగారావు, ప్రహ్లాదగా బేబి రోజారమణి పోషిస్తున్నారు. నారదపాత్ర బాలమురళీకృష్ణ పోషిస్తున్నారు. ఇంకా అంజలిదేవి, ధూళిపాళ, మొదలగువారు నటిస్తున్నారు. ఈ చిత్రానికి దర్శకుడు చిత్రపు నారాయణమూర్తి.

రెండవది పై బేనర్‌లో తమిళంలో నిర్మించిన 'కులందియుం దైవం' చిత్రాన్నే తెలుగులో కూడా నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలో హరనాథ్, రేలంగి, పద్మనాభం, జమున, జి. వరలక్ష్మి, బేబి పద్మిని మొదలగువారు నటిస్తున్నారు. ఈ చిత్రానికి దర్శకత్వం—కృష్ణన్—పంజు నిర్వహిస్తున్నారు.

ధర్మాజీ ●



నటి జయలలిత

# ప్రజ్ఞ గల దర్శకనిర్మాతగా నాకు తెలిసిన శాంతారాం

ప్రఖ్యాత దర్శక నిర్మాతగా అఖండ ఖ్యాతి నార్జించుకున్న శ్రీ వి. శాంతారావ్—శాంతారావ్ రాజారావ్ వణ్ కుద్రె—1901 లో కొల్హాపూర్‌లో జన్మించారు. బాల్యమందే ఆయన తన హైస్కూల్ చదువుకు స్వస్తిచెప్పి ఓ రైల్వే వర్క్‌షాప్‌లో నెలకి 15 రూపాయల జీతానికి కుదిరాడు. రోజుకు పది గంటలు ఆ ఉద్యోగం చేస్తూ, మిగతా సమయంలో స్థానిక సినిమా థియేటర్‌లో డోర్ బాయ్‌గా ఉంటూ అదనంగా మరో అయిదు రూపాయలు సంపాదించేవాడు. ఇలా సినిమాలు ఉచితంగా చూసే అవకాశం లభించడంవల్ల ఆయనలో సహజంగా ఉన్న నటనా సంబంధమైన ప్రజ్ఞా విశేషాలు మేల్కొనడం ప్రారంభించాయి. సరిగ్గా అదే సమయంలో బాలగంధర్వ నాటక సమాజం కొల్హాపూర్ రావటం తటస్థించింది. రంగస్థల నటునిగా తన స్థాయిని పెంచుకోవాలనే ఉద్దేశ్యంతో శాంతారావ్ బాలగంధర్వ వద్ద కెళ్లి తన కోర్కెను విన్నవించాడు. ఫలితంగా ఉద్యోగమైతే దొరికింది గాని ఆయన కోరుకున్నటువంటిది మాత్రం కాదు. అక్కడికీ యిక్కడికీ వార్తలు చేరవేసేపని. దీంతో అతని ఆశలన్నీ వమ్మైపోగా కొన్నాళ్లకు ఆ ఉద్యోగానికి రాజీనామా యిచ్చాడు శాంతారాం. అయితే అదృష్టవశాత్తు త్వరలోనే ఆయనకి మహారాష్ట్ర ఫిలిం కంపెనీలో ఉద్యోగం దొరికింది. ఆ సంస్థ అధినేత శ్రీ బాబూరావ్ పెయింటర్ శాంతారావ్‌ని చిత్రనిర్మాణంలోని అన్ని విభాగాలలోనూ పనిచేయటానికి నియమించారు. అలా అన్ని శాఖలలో పనిచేసి ఉండటంవల్లనే చిత్రనిర్మాణంలో శ్రీ శాంతారాం అద్వితీయమైన ప్రతిభను సంపాదించగల్గారంటే అతిశయోక్తి లేదు.

శ్రీ శాంతారాం తన 29 వ ఏట మరో నలుగురు భాగస్వాములతో కలసి తమ స్వంత సంస్థ, ప్రభాత్ ఫిలిం కంపెనీ, 1929 లో స్థాపించారు. కొల్హాపూర్‌లో స్థాపింపబడిన ఆ సంస్థను 1934 లో పూనా మార్చారు. కొద్ది కాలంలోనే ప్రభాత్ ఫిలిం కంపెనీ అఖిలభారత ఖ్యాతి నార్జించుకుంది.

ప్రభాత్ ఫిలిం కంపెనీ మూడు పువ్వులు ఆరు కాయలుగా విలసిల్లుతూ శ్రీ శాంతారాం దానికి ముఖ్యుడుగా ఉన్న సమయం(1940)లో కథా రచయితగా నేను ఆయనకు పరిచయుడనయ్యాను.

చారిత్రాత్మకమైన రామశాస్త్రి కథను 1938 లో శ్రీ హిమాంశురాయికి సూచించాను. అంతవరకూ చారిత్రాత్మక చిత్రాలు తీయటానికి సాహసించని ఆయనకు నా సలహా నచ్చింది. మహారాష్ట్ర చరిత్ర నంతట్నీ క్షుణ్ణంగా చదివి రామశాస్త్రి కథను తయారుచేయవలసిందిగా ఆదేశించారాయన. మూడు నెలల తర్వాత నేను తయారు చేసిన కథను పరిశీలించి అది బాంబే టాకీస్ చిత్రానికి సరిపోయే విధంగా లేదని నిరాకరించారు. తర్వాత నేనా కథను చరిత్రాత్మక చిత్రాలు తీయటంలో అందెవేసిన చెయ్యి అనిపించుకున్న సొహరాబ్ మోడీకి చూపించాను. ఆయన కూడా దాన్ని నిరాకరించారు. నిరాశా నిస్పృహలతో కొట్టు



శ్రీ శాంతారాం

మిట్టాడుతున్న ఆ సమయంలో నా మస్తిష్కంలోకి మెరుపులాంటి ఆలోచన వచ్చింది. 1939 డిసెంబరులో నేనా కథను తీసుకొని బొంబాయినుంచి పూనా బయలుదేరాను. తిరిగి రావటానికి సరిగ్గా సరిపోయే రైలుచార్జీలు, చేతిసంచీలో ఉన్న నా కథ తప్పితే నా దగ్గర మరేమీ లేదు.

పూనాలో రైలు దిగ్గానే శ్రీ శాంతారావ్‌కి ఫోన్ చేశాను :

"శాంతారావ్‌గారూ, నేను ముఖ్యంగా మిమ్మల్ని కల్సుకోవాలనీ, నా కథను తమకు చూపించాలనీ బొంబాయి నుంచి వచ్చాను."

"మీ కథ సాంఘికమేనా ?"

"కాదండీ ! అది చరిత్రకి సంబంధించింది."

"అయితే శ్రమపడి మీ రిక్కడికిరావద్దు. మేమిక చరిత్రాత్మక చిత్రాలను తీయకూడదనే నిర్ణయాని కొచ్చాము. మా దృష్టంతా సాంఘిక చిత్రాలమీదే కేంద్రీకరించదల్చుకొన్నాము."

"కానీ నా కథను వింటే తప్పక మీరు మీ నిర్ణయాన్ని మార్చుకుంటారనే నమ్మకం నాకుంది."

"మీకు అంత నమ్మకం ఉంటే (నవ్వుతూ) ఈరోజు మధ్యాహ్నం మీరు నన్ను చూడడానికి రావచ్చు."

ఆనాటి మధ్యాహ్నం నేను శాంతారావ్‌ని కల్సుకుని 'నా కథ రామశాస్త్రిని గురించి' అన్నాను.

ఆయన ఆశ్చర్యంతో "ఏమిటీ ! రామశాస్త్రా? రామశాస్త్రి ప్రభుమే? అటువంటి అసాధారణ విషయమా ?" అంటూ ఉద్రేకంతో తాను చిన్నప్పుడు రామశాస్త్రిని గురించి చదివినది, ఇప్పటికీ ఆయన పేరు విన్నా, ఆయన్ను గురించి చదివినా తనకు కన్నీళ్ల పర్యంతమవుతుందని చెప్పి నా కథను పరిశీలించడానికి అంగీకరించారు.

నేను శ్రీ శాంతారావ్ కిచ్చిన కథ 15,000 మాటలతో చాలా పెద్దదిగా ఉంది. దాన్ని చదివి ఆయన తమ నిర్ణయాన్ని తెలియజేస్తామని చెప్పారు. కానీ ఆశ్చర్య మేమంటే అది జరిగిన కొద్దికాలంలోనే—వారాలు కాదు, నెలలు కాదు—ఇంకొక నిర్మాత కూడా దాన్ని పరిశీలించడానికి తీసుకున్నారు.

రెండు రోజుల తరువాత నేను శ్రీ శాంతారావ్‌ని చూడడానికి వెళ్లేసరికి టైప్ చేసిన ఎగ్రిమెంట్ ముందు పెట్టుకొని ఆయన నాకోసం ఎదురు చూస్తున్నారు.

నేను వెళ్లగానే "మీకు సంతోషాన్ని కలిగించే విషయా న్నొకదాన్ని చెప్తాను. మీ కథ మా కార్యక్రమాన్నంతటినీ తలక్రిందులు చేసింది. సెట్స్ మీదకి వెళ్ళే మా తర్వాతి చిత్రం రామశాస్త్రి. ఇక మీరు చేయాల్సిందల్లా సాధ్యమైనంత త్వరలోనే స్క్రీన్‌ప్లే తయారు చేసివ్వడమే. అందుకే ఎగ్రిమెంట్ మీద సంతకం చేయించటానికి సిద్ధంగా ఉంచుకున్నాను" అన్నారు శ్రీ శాంతారావ్.

నా మరాఠీ కథ ఆధారంగా ప్రభాత్ ఫిలిం కంపెనీకి స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు రాయటానికి అంగీకరిస్తూ ఎగ్రిమెంట్‌మీద సంతకం చేశాను.

ఆ మర్నాడే బయానాగా కొంత మొత్తం నాకు యిచ్చారు. తర్వాత నాలుగైదు నెలల్లో శ్రీ శాంతారావ్‌కు పూర్తిగా సంతృప్తి కలిగే రీతిలో నాకు యిచ్చిన పనిని పూర్తి చేశాను.

ప్రతి నిత్యమూ శ్రీ శాంతారాంతో కథను గురించి చర్చించిన ఆ నాలుగు నెలల కాలాన్ని గుర్తు చేసుకుంటే ఒక విశిష్టమైన కళాకారుడిగా ఈ రోజుకీ చిత్ర పరిశ్రమలో తనకి తనే సాటి అన్పించుకున్న ఆయన ప్రత్యేకతలు నాకు గుర్తుకి వస్తూనే ఉంటాయి.

(1) శ్రీయుతులు హిమాంశురాయి, సొహరాబ్ మోడీలు నిరాకరించిన నా కథను శ్రీ శాంతారాం ఏమాత్రం సందేహించకుండా ఎలా అంగీకరించారు ?

బాంబే టాకీస్‌వారు తీసే ప్రతి చిత్రం దేవికారాణి నాయికగా రూపొందింపబడుతుంది. స్క్రీన్‌ప్లేలో ఆమె పాత్రకు అత్యంత ప్రాధాన్యత, ఆకర్షణ ఉంటాయి. బహుశః సొహరాబ్ మోడీ కూడా తన చిత్రంలో నటించడానికి ఒప్పందం కుదుర్చుకొన్న ఏ నటినో దృష్టిలో పెట్టుకుని నా కథను పరిశీలించి ఉండవచ్చు. రామశాస్త్రి కథలో నాయికకు ప్రాధాన్యతే లేదు. అందులో నాయకుడు రామశాస్త్రి. ఇంకే స్త్రీకి అందులో ప్రాధాన్యత లేదు. అందుచేతే చిత్ర విజయంపై నమ్మకంలేక హిమాంశురాయి, సొహరాబ్‌మోడీలు నా కథను చిత్రీకరించడానికి సాహసించలేకపోయారు. కానీ శ్రీ శాంతారాం తన దర్శకత్వంపై గట్టి నమ్మకం కలవాడూ, రామశాస్త్రి జీవితం ఎంత గొప్పదో తెలిసినవాడూ కాబట్టి చిత్రాన్ని విజయవంతం చేయగల మనుకున్నారు.

ఇదే శ్రీ శాంతారావ్‌కూ ఇతర నిర్మాతలకూ ఉన్న భేదం.

(2) నేను కథను గురించి చర్చించడానికి వెళ్లిన మొదటి రోజున "మీరు స్క్రీన్‌ప్లే రాయటం మొదలుపెట్టే ముందు నే నొక్క విషయం చెప్తాను. కథా రచయిత ఊహాకల్పన చేసే కళాకారుడు. అందుకే రాసేప్పుడు ఏవిధమైన నియమ నిబంధనలను పెట్టదల్చుకోలేదు. అయినా నేను కోరేది, మీరు సాధ్యమైనంత త్వరలో పనిని పూర్తి చేయాలని. కథను గురించి, సందర్భాల గురించి నాతో చర్చించడానికి మీరు మీ యిష్టమొచ్చిన

రోజూ, మీకు వీలైన టైంలో నన్ను కల్సుకోడానికి మీ కెప్పుడూ అవకాశం ఉంటుంది. నేను స్టూడియోలో 10 నుంచి 6 వరకూ ఉంటాను. ఏ రోజైనా మీరు రాలేకపోతే ఆ విషయం ఫోన్‌లో చెప్పేస్తే సరిపోతుంది.'' అన్నారు శ్రీ శాంతారాం.

నాకు వీలుగా ఉండేలా రోజూ సాయంకాలం నాలుగు గంటలకు ఆయన్ని చూడటానికి నిర్ణయించుకున్నాను.

దాదాపు ప్రతిరోజూ నే వెళ్ళేసరికి శ్రీ శాంతారాం నాకోసం ఎదురుచూస్తుండేవారు. వెళ్ళినప్పుడల్లా రెండు గంటలు చర్చలకు వినియోగించేవాళ్ళం. ఆ సమయంలో మా చర్చకు ఎలాంటి అంతరాయం లేకుండా ఆయన ఏర్పాటు చేశారు. కాని తప్పించుకోడానికి వీల్లేని 'ట్రంక్‌కాల్స్' ని మాత్రం తప్పనిసరిగా అందుకునేవారు.

రచయిత ఊహాశక్తిని పూర్తిగా వినియోగించుకోగలిగిన శ్రీ శాంతారాం లాంటి నిర్మాతను ఎంతోమంది ప్రసిద్ధ నిర్మాతలతో పరిచయమున్న నేను ఎక్కడా చూడలేదు.

(3) నేను రామశాస్త్రి పని ప్రారంభించిన రెండు వారాల తర్వాత ఓ రోజున "మీరు రేపు ఒక అరగంట ముందుగా రావటానికి వీలవుతుందా? ఎందుకంటే, కుక్కలకు తర్ఫీదు యివ్వటంలో పేరుపొందిన ఒకతన్ని ప్రదర్శన యివ్వటానికి యిక్కడికి రమ్మన్నాను. మనమూ ప్రదర్శన చూడొచ్చు'' అన్నారు.

రామశాస్త్రి కథలోని మొదటి దృశ్యంలో ఏడేళ్ళ బాలుడుగా రామ్ తన కుక్కపిల్లతో నదిలో ఈత కొడుతున్నట్లు చిత్రించాను. దాన్ని శాంతారామ్ తన దృష్టిలో పెట్టుకొని తర్ఫీదు పొందిన కుక్కపిల్ల లభ్యమవుతుందా లేదా అని అప్పటినుంచీ ప్రయత్నిస్తున్నారు.

ఇలాంటి చిన్న చిన్న విషయాలకు కూడా అత్యంత ప్రాముఖ్యత నిచ్చి మొదట్నుంచి జాగ్రత్త వహిస్తారు శ్రీ శాంతారామ్. సాధారణంగా నిర్మాత లందరూ ముఖ్యమైన విషయాలన్నింటినీ ఆఖరు నిముషంలో ఆలోచిస్తుంటారు.

(4) రామశాస్త్రి మహారాష్ట్ర రాజ్యానికి ప్రధాన న్యాయాధికారిగా పనిచేశారు. అలా ఆయన మంచి ఉచ్ఛస్థితిలో ఉన్నప్పుడు న్యాయం కోసం పదవికి రాజీనామా యిచ్చి, రాజ్యాన్నివదలి, మారుమూల పల్లెకు వెళ్ళి దారిద్ర్యంతో జీవితాన్ని గడపటానికి నిశ్చయించుకున్నారు. తర్వాత ఒక రోజున, తినటానికి తిండి కూడా కరువైన పరిస్థితిలో, ఆయన తన ఆవేదనను భార్యకు వెల్లడించారు. అందు కామె నవ్వుతూ "ప్రధాన న్యాయాధికారి భార్యగా సకల సౌఖ్యా లనుభవిస్తూ పెద్ద భవనంలో ఉన్నప్పటికంటే ఇప్పుడే నేనెంతో హాయిగా ఉన్నాను వస్తులుంటున్నప్పటికీ. మీరు అబ్బాయిని తొడపై కూర్చోపెట్టుకుని ఎప్పుడూ నా ఎదుటే ఉంటున్నారు, అందుకే నాకు చాలా ఆనందంగా ఉంది'' అన్నది.

నేను శ్రీ శాంతారాంకి యిచ్చిన ఈ కథాభాగాన్ని చదివి ఆశ్చర్యంతో "రామశాస్త్రిభార్యఅన్న హృదయాన్ని కదిలించే యీ మాటలు ప్రస్తుతం నా భార్య అంటున్న మాటలలాగే ఉన్నాయి. కొల్హాపూర్ స్టూడియోలో నెలకు యాభై రూపాయలు జీతం తెచ్చుకునేప్పుడే ఆమె కెంతో ఆనందంగా ఉండేదట. స్టూడియో అధినేతనైన తర్వాత యింటి కంటే ఎక్కువ కాలం స్టూడియోనే అంటిపెట్టుకుని ఉంటంతో సరిపోతున్నది'' అన్నారు.

అనేకమందిలో అరుదైన ప్రజ్ఞ శ్రీ శాంతారామ్‌లో ఉన్న దనటానికి ఈ ఒక్క ఉదాహరణ చాలు. ఆయన కథలోని అనుభవాలను నిజ జీవితానుభవాలతో జోడించి లోతుకు పోయి తాను చిత్రీకరించదలచిన విషయాన్ని గూర్చి ఆలోచిస్తారు.

నటనకు సంబంధించిన విశేష ప్రజ్ఞ, అద్భుతమైన తెలివితేటలే చిత్ర పరిశ్రమలో శ్రీ శాంతారామ్ అఖండ విజయాల్ని సాధించటానికి కారణాలు కావు. ఆయనలోని విశిష్టమైన గుణాలు—క్రమశిక్షణ, నియమబద్ధమైన జీవితం—కూడా అందుకు సహకరించినయి.

శ్రీ శాంతారామ్‌తో నాకు గల మూడు నెలల పరిచయంలో ఎప్పుడూ ఆయన సిగరెట్ త్రాగటంగానీ, కనీసం ఒక కప్పు కాఫీ లేక టీ తీసుకోటంగానీ, తమలపాకులు వేసుకోటం గానీ నేను చూడలేదు. ఇలాంటి చిన్న చిన్న దురభ్యాసాలను కూడా ఆయన తన దరికిజేరనీలేదు.

ఉదయం పది గంటలకు స్టుడియోకు వస్తే మళ్ళీ సాయంత్రం ఆరు కానిదే శ్రీ శాంతారామ్ యింటికి వెళ్ళరు. ఎంత పని ఒత్తిడిగా ఉన్నా, ఆలస్యమైనా టిఫిన్ తీసుకోడం గానీ, పానీయాలు సేవించడంగానీ చేయరు. ఇంటికీ, స్టుడియోకి ఎక్కువ దూరం లేకపోయినా మధ్యాహ్నం ఫలహారం యింటినుంచే కేరియర్‌లో స్టుడియోకి తెప్పించుకునేవారు. మధ్యాహ్నం ఆయన తినేది మూడు పావుల సజ్జరొట్టెలు మాత్రమే.

సజ్జరొట్టె మహారాష్ట్రలో బీదవాళ్ళు తినే ఆహారం. కాని గోధుమ కంటే బలమైనది. కాయకష్టం చేసేవాళ్ళు కాని దాన్ని తిని వంట బట్టించుకోలేరు. ఉన్నవాళ్ళకు సజ్జరొట్టె అంటే చిన్న చూపు. కాని శ్రీ శాంతారామ్‌కి అలాంటి భేదభావం లేదు. అవి తినటంలోనే ఆయన ఆనందాన్ని అనుభవించేవారు. అది కూడా మూడు పావులకు మించి ఎప్పుడూ తినలేదు. ఆయన శరీరం దృఢంగా ఆరోగ్యంగా ఉండటానికి గల కారణం యిలాంటిఆరోగ్యకరమైనఅలవాట్లనుకలిగిఉండటమే.

"శ్రీ శాంతారామ్ ఫలహారం మూడు పావుల సజ్జరొట్టెలు'' అనే మాటలు ఆ రోజుల్లో తరచుగా ప్రభాత్ స్టూడియోలో ముచ్చటగా వినపడుతుండేవి.

* * *

ప్రభాత్ ఫిలిం కంపెనీకి రామశాస్త్రి కథను వ్రాసిన ఆ రోజులు గుర్తుకు వచ్చినప్పుడంతా శ్రీ శాంతారామ్ విశేష ప్రజ్ఞ, యిదివరకెన్నడూ తెరపై కన్పించని కొత్త రకమైన కథను చిత్రీకరించడంలోని ఆయన ఆత్మ విశ్వాసం నన్ను చకితుణ్ణి చేస్తాయి. కాని ఆ చిత్రాన్ని తీసిన ఘనత చివరికి ఆయనకు దక్కకుండా పోయింది. నేను స్క్రీన్‌ప్లే తయారుచేసి యిచ్చిన కొద్ది కాలానికే ఆయనకీ, భాగస్తులకీ అభిప్రాయభేదాలొచ్చి శ్రీ శాంతారాం ప్రభాత్ ఫిలిం కంపెనీ నుంచి విడిపోయారు. న్యాయంగా శ్రీ శాంతారాంకే నా కథమీద హక్కు ఉంది. కాని ఒప్పందం ప్రకారం ఆ హక్కు ప్రభాత్ ఫిలిం కంపెనీకి చెందింది. అందువల్లే ఆసక్తి ఉన్నా తానా చిత్రాన్ని స్వతంగా నిర్మించడానికి అవకాశంలేక పోయింది శ్రీ శాంతారాంకి. తర్వాత మూడేళ్ళకు 1943 లో ప్రభాత్ ఫిలిం కంపెనీ దాన్ని సెట్స్ మీదకి తీసికెళ్ళింది. అదే సమయానికి భారతీయ చిత్రాలు 11,000 అడుగుల నిడివి కంటే ఎక్కువ ఉండకూడదన్న ఆంక్షను విధించింది ప్రభుత్వం. నేను రాసిన స్క్రీన్‌ప్లే 14,000 అడుగుల నిడివికి సరిపోయే విధంగా ఉంది. చిత్రం నిడివి 11,000 అడుగులకు మించకుండా ఉండేందుకుగాను దానిలో కొంతభాగం తీసేశారు. చివరకు రామశాస్త్రి కథ చిత్రంలో రూపే మారిపోయింది. శ్రీ శాంతారామ్ సహాయ సహకారాలతో నేను తయారుచేసిన కథతో పోల్చి చూస్తే ఆ చిత్రం విలువ ఎంతో తగ్గినట్లు నా కనిపించింది.

—వి. ఎస్. సుక్తాంకర్.



భార్యా పుత్రులతో పూనా నగరాన్ని వదలిపెట్టి పోతున్న రామశాస్త్రి.

# చిత్రాలలో నృత్యాలు



'శకుంతల' లో సరోజాదేవి

"గులేబకావళి"లో మదనా 'సుందర నా దొర' అనే పాటవుంది. రచన అతి మధురంగా సరసమైన జావళీ—పదం వరవడిలోసాగింది. కాని, దానికి యేర్పరచబడ్డ వరుస జావళి వరుసలోనూలేదు, పదం పద్ధతిలోనూ లేదు. ఒకవిధంగా ఔత్తరాహిక సంగీత సాంప్రదాయాన్ని అనుసరించినదని చెప్పవచ్చు. ఇక ఆపాటకు చేయబడిన నాట్యం నాట్యంకాదు. అయమానుబద్ధమైన కసరత్తు. సంగీత, సాహిత్య నృత్యాల చక్కని మేళవింపై విరాజిల్లవలసినది. కేవలం ఒక కర్ణపేయమైన పాటగానే మిగిలిపోయింది. కోమలచేత చక్కని తిల్లానా పాడించి దానికి చక్కని నృత్యం ("తోడు దొంగ")ల్లో చూపిన ఎన్.ఎ. టి. వారి చిత్రంలోనే యిది జరగటం చింతించవలసిన విషయం.

పై విధంగానే కొరగాకుండా పోయినదే "నర్తనశాల"లో 'నరవరా కురువరా' నృత్యం. మంచి పాటకు అనుబంధంలా కాకుండా కేవలం మన చిత్రాలలోనే వినిపించే క్లబ్ డాన్సు పాటలాగావున్నది పైపాటకు అమర్చబడిన సంగీతం. దీనికి ఆ నర్తకిచేత చేయించబడిన కుప్పిగంతులూ, కోతిచేష్టలూ వర్ణనాతీతం. ఊర్వశి అలా ఒళ్ళు విరుచుకొంటూ శివం తొక్కివుంటే వెంటనే ఇంద్రసభనుండేకాదు స్వర్గ బహిష్కారమే జరిగి వుండేది.

వాహినీ, విజయా, సంస్థల చిత్రాలలో నృత్యాలు మెచ్చుకోదగ్గవిగానే వుంటవి. శాస్త్రీయాలైనా, రెంటికీ చెందనివైనా ఈ వాక్యానికి యిటీవలే 'చాలమట్టుకు' అనే విశేషణాన్ని చేర్చుకోవలసి వచ్చింది. విజయా "హరిశ్చంద్ర"లో ఇంద్రసభలో ఎల్. విజయలక్ష్మి చేసిన తిల్లానా శాస్త్రీయమైనదనే భ్రమిసేరు కొందరు. నిజమే. పాడిన తిల్లానా శాస్త్రీయమైనదే. చేసిననాట్యమూ శాస్త్ర సమ్మతమైనదే. అసలు కిటుకూ, అందులోని లోపమూ యేమిటంటే పాడిన తిల్లానా విశుద్ధమైన కర్ణాట సంగీత ధోరణిలో తంజావూరు భరత నాట్యానికి అనువుగా వుండగా, నర్తకిచేత చేయించిన నృత్యం కాచి వడబోసిన కూచిపూడి. ఏమీ తెలియని వారికి యీ మర్మం తెలియకపోయినా ఏమాత్రం తెలిసిన వారికీ యిది భరింపరానిదిగానే ఉన్నది. ఇరవైయేళ్ల క్రిందటే 'ఇది మంచి సమయ' మనిపించిన (భక్త పోతన) దర్శకునికి యీ సంగతి తెలియదనుకోవడం దుస్సాహసం. ఈ నృత్యం ఎలాగూ పామరులకోసం ఉద్దేశింపబడినది కాదుగదా! నాట్యంతో యేదో కొంత పరిచయంవున్న వారికోసమే ప్రవేశపెట్టబడినది. వారలకే అసంతృప్తి కలిగించే విధానం ఉండటం ఎందుకో తెలియదు మరి!

కొంత వరవడి మార్చినా 'బాల గోపాల' వంటి క్లిష్టమైన తరంగాన్ని 'దొంగరాముడు' లో జమునచేత చేయించి మెప్పించగలిగిన అన్నపూర్ణవారు, నృత్యం అంతో యింతో తెలిసిన రాజశ్రీ: కాంచనలచేత క్షేత్రయ్య పదాల్ని కూచిపూడి అంటూ, కాకుండా చేయటం విచారకరం. కూచిపూడి పద్ధతిలో రంగంపై యెన్ని చిత్రాలున్నా, ఒక పాత్ర మరొక పాత్రతో చెప్పుచున్న విషయమైనా, అభినయాన్ని ప్రేక్షకుల నుద్దేశించే సాగించటం శాస్త్రబద్ధమైన సాంప్రదాయం. ఆ చిత్రంలో అలాకాక ఆ అభినేతలు జంటగా గంతులువేయడం, కృష్ణపాత్రధారి నుద్దేశించి నాయిక పాత్రధారిణి అభినయం చేయడం, వీటన్నిటికీ అనుగుణ్యంగా వాద్యానుసరణ యేర్పాటు చేయడం—వీటివలన వినటానికీ, చూడటానికీ కూడ అది క్షేత్రయపదం కాకుండాపోయింది.

నృత్యాన్ని ఒక ముఖ్యమైన కథాంశంగా స్వీకరించిన "అమరశిల్పి జక్కన్న"లో 'అందాల బొమ్మతో ఆటాడవా' సంగీతసాహిత్యాల పరంగా పసందైన జావళి. రచనలో దీనికే మాత్రం తీసిపోనిది 'నగుమోము చూపించవా' అన్నది. కాని దీనికి వరస చేయడంలో పప్పులో కాలువేయడం జరిగింది. అందులో వినిపించినట్లుగా మధ్యలో స్వరాలు, యేజావళీలోగాని, పదంలోగాని ఉండవు. వుండకూడదు. పైగా ఈ రెండు పాటలకూ అన్యాయం జరిగింది. తెర కెక్కింపబడిన బద్ధక విధానంలో. శాస్త్రీయ నృత్యాన్ని ఉద్వేగాన్వితం చేసేది స్పష్టమైన పదవిన్యాసం. ఈ పదలాఘవం కనబడకుండా, కనబడినపుడు తాళానికి అడుగు పడకుండా ఆ రెండు పాటలూ అడవిగాచిన వెన్నెలైనవి.

మరొకవిధంగా కూడ యిటీవలి శాస్త్రీయ నృత్యాలు నిరాశాజనకంగా ఉంటున్నవి. దీనికి బాధ్యులు సంగీత దర్శకులే అనిచెప్పాలి. శుద్ధ కర్ణాటకం ప్రేక్షకులకు రుచించదని కాబోలు హిందుస్తానీ శాస్త్రీయ సంగీతంలో వరసలు చేయడం, దీనికి భరతనాట్య పద్ధతిలో నాట్య మేర్పరచడం యిటు యెగిరే పక్షీకాక అటు నడిచే జంతువూగాక ఆ నృత్యాలు గణనలోకి రాకపోవటం "పాండవ వనవాసం", "కృష్ణపాండవీయం" చిత్రాలలో దుర్యోధనుని ప్రోల జరిగే నృత్యాలలో చూడవచ్చు.

సంగీత, సాహిత్య నృత్యాలు ఉత్తమంగా ఉండేటప్పుడు ఛాయ, కూర్పు, నర్తకుల నేర్పు ఆ ఉత్కృష్టతను పెంపొందించగలవు. నృత్య సన్నివేశాలను ఛాయాగ్రాహకుడు చాలా మెళకువతో చిత్రీకరించవలసి వుంటుంది. అంగ, ఉపాంగాల కదలికలు ఎక్కువగా ఉన్నపుడు శరీరమంతా ఫ్రేమ్‌లో కనపడేటట్లు, అభినయం ముఖంలో కనబరచినపుడు క్లోజప్‌లో అవి విశదీకరింపబడేటట్లు,

గమనస్థితిలో నాట్యంవుంటే దాన్ననుసరించి కేమెరాను నడపబడేటట్లు అమర్చి ఆ కళకు న్యాయం చేకూర్చగల సమర్థుడు ఛాయాగ్రాహకుడు. లయానుగుణ్యంగా 'షాట్స్' మార్చి కూర్చి చూపరులలో ఉత్సాహాన్ని ఇనుమడింపజేయగలవాడు యెడిటర్. లయబద్ధంగా కూర్పు లేకపోతే నాట్యం చాలా నీరసంగా కనబడుతుంది. ఇక నర్తకుల నేర్పు యెప్పుడూ రసానుభూతికి దోహదం చేస్తూనే ఉంటుంది. అందుకే కమల, విజయలక్ష్మి, వైజయంతిమాల, పద్మిని, రాగిణి, హెలెన్, కుంకుంచేసే నృత్యాలు చాలమట్టుకు హెచ్చు స్థాయిలో ఉంటాయి.

చిత్రసీమలో ఈనాడు ఉన్నటువంటి పరిస్థితులలో ఛాయాగ్రాహకునికి తీయవలసిన 'షాట్స్' నృత్య దర్శకుడు చెప్పటమూ, దర్శకుడు తన ఉద్దేశానుసారం సంగీత దర్శకునితో వరసలు, నిర్మాతలు తమకు తోచిన విధాన తాము సహకరించడమూ, ప్రఖ్యాత నర్తకులు తమ అభిప్రాయానుసారం కొలది కొలది మార్పులను చేయటమూ, బాగా లేని ఒక 'షాట్' తీసివేసి దానిస్థానే మరొకటి యెడిటర్ వేయటమూ యివన్నీ జరుగుతున్నవే. అన్నిటిలో లాగానే యిందులో మంచీ ఉన్నదీ, చెడూ వున్నదికాని యీ విధానంవలన ఎక్కువ పాలుమంచే జరుగుతున్నదనే చెప్పాలి.

—వి. ఎ. కె. రంగారావు



'శ్రీకాకుళ ఆంధ్రమహావిష్ణు' కథలో
జమున

## రచయితలకు మనవి

మా కార్యాలయం చేరే ప్రతిరచనతోనూ దానిరచయిత గాని, రచయిత్రిగాని అది తమ స్వంతరచనేనని, దేనికీ అనుకరణ కాదనీ హామీ వ్రాసి పంపాలి. ఇటువంటి హామీలేని రచనలను ప్రచురణకి స్వీకరించలేము.

సంపాదకుడు
ఆంధ్రసచిత్రవారపత్రిక



ఇది ఫాక్టరీ కాదు : చండీఘర్ హైకోర్టు

# పంజాబ్ పరిచయం

(11వ పేజీ తరువాయి)

నంగల్'లోని యెరువుల ఫ్యాక్టరీ పంజాబులోని భారీ పరిశ్రమలో ఒకటి. ప్రపంచంలో పేరుగాంచిన మన భాక్రానంగల్ ప్రాజెక్టు స్వర్గీయ నెహ్రూగారి మహోన్నత వుద్యమాల్లో ఒకటి.

ఇక పంజాబు రాష్ట్రంలోదే అయినా హిమాచల్ ప్రదేశ్‌కు ముఖ్య పట్టణంగా ఉంటూన్న 'సిమ్లా' యిక్కడ తప్పక చూడాల్సిన మరో స్థలం. దేశంలోకెల్ల ప్రసిద్ధిఅయిన యీ హిల్‌స్టేషన్ కల్కాకు 56మైళ్ళ దూరంలోవుంది. కల్కానుంచి సిమ్లా వెళ్లే రైలుమార్గం దారి పొడవునా చక్కని దృశ్యాల్తో చూచేందుకు చాలా ఆకర్షణీయంగా వుంటుంది. సిమ్లాను పరిసర ప్రాంతాల్ని గురించే ప్రత్యేకంగా చాలా వ్రాయచ్చు. ఈచుట్టు ప్రక్కల్నే యెన్నో పిక్నిక్ సెంటర్స్ వున్నాయి. ముఖ్యంగా చూడాల్సినవి, జాకూహిల్స్, కుఫ్రి, సమ్మర్ హిల్స్, కసౌలీ మొదలయినవి. ఐస్‌స్కేటింగ్ శీతకాలంలో ఒక ఆకర్షణీయమైన ఆట. శీతోష్ణస్థితి కారణంగా కొద్దిగా యెర్ర బడ్డ బుగ్గలతో, చిన్నకుచ్చు టోపీలతో యిక్కడి పిల్లలు యెంతో ముద్దుగా వుంటారు. పిల్లలుకూడా యెంతో సునాయాసంగా కొండప్రాంతాల్లో నడువగలరు.

పంజాబులో చూడాల్సిన స్థలాన్ని గురించి వ్రాయడం యింతటితో వదిలేస్తూ, పంజాబీల నాగరికతను గురించి ఒకటి రెండు ముక్కలు వ్రాసి వ్యాసం ముగిస్తా. వీరెంతో సహృదయులు; దైవం కూడా అంతగానే సహకరిస్తూ సశ్యశ్యామలమైన ప్రదేశాల్ని ప్రసాదించాడు. దేశసేవకై ప్రాణాల్నిర్పిస్తారన్నది సత్యం. గోధుమతో బాటు వరికూడా బాగా పండించినా, శక్తివంతమని గోధుమనే వీరు ఆహారంగా వాడ్తారు. వీరిదేహబలం వీరు ఆహారానికిచ్చే ప్రాముఖ్యతకు నిదర్శనం. పేద, గొప్ప అన్న భేద భావంలేని వీరు దేశంలో యితర ప్రాంతాలవారికి ఆదర్శప్రాయులు. వ్యాసం, ఫొటోలు: **రాగిణి**

---

## జంషెడ్‌పూర్‌లో బలప్రదర్శనలు

మార్చి 21 వ తేదీన జంషెడ్‌పూర్‌లో జరిగిన బల ప్రదర్శనలలో 60 ఏళ్ళ శ్రీ పి.కె. రావు (తాతా ఉక్కు ఇనుము కంపెనీలో పని చేస్తున్నారు.) మంచి ప్రశంసలు పొందారు. ఆయన దేహ నిర్మాణ పథకాన్ని తమ 48 ఏట ప్రారంభించారుట.

Edited Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6&7 Thambu chetty Street, Madras-1. Phones : Editorial, 21747, Other depts : 29766. Chief Editor: S. Sambhu Prasad.

HIMALAYAN

FINEST GOLDEN DUST TEA

LIPTON'S

FINEST GOLDEN DUST TEA

# మేలిరకం "డస్ట్" టీలలో సాటిలేనిది

## లిప్టన్స్

## హిమాలయన్ గోల్డెన్ డస్ట్ టీ



ఈ టీతో మీరు కమ్మని, చిక్కని బంగారు ఛాయగల టీ కప్పుల వెంబడి కప్పులు అతి త్వరలో తయారుచేయగలుగుదురు. ఈ పానీయమును మీరే త్రాగి చూడండి. మీ అతిథులకుకూడా యివ్వండి. మీరు తప్పక సంతోషముతో వికసిస్తారు. అవును – మీ ఆనందభరితులైన అతిథులుకూడాను. లిప్టన్స్ హిమాలయన్ గోల్డెన్ డస్ట్ టీ మేలిరకం టీలలో నిజంగా అద్వితీయమైనది.




లిప్టన్స్ అంటే మంచి టీ